# సమర్థ సద్గురు

## ఆధ్యాత్మిక మాసపత్రిక

శ్రీకాళీగార్డెన్స్ ఆశ్రమం - 522508, గుంటూరు జిల్లా
ఫోన్ : (0863) 2293280, 2293564, 2293206
web: www.mathaji-babuji.org samardhasadguru@rediffmail.com



Volume 28 Issue 6
No.of Pages 40
FEBRUARY 2009

| | | |
|---|---|---|
| 5సం॥ల చందా | రు. | 250.00 |
| 2సం॥ల చందా | రు. | 120.00 |
| సంవత్సర చందా | రు. | 60.00 |
| విడిప్రతి వెల ..... .. | రు. | 5.00 |

బ్యాంక్ డ్రాఫ్ట్స్ A/C.Y.S.C.K.P.M చారిటబుల్ ట్రస్ట్ పేరులో డ్రా చేయండి. M.O.,బ్యాంక్ డ్రాఫ్ట్స్ పంపవలసిన చిరునామా:
మేనేజరు
సమర్థసద్గురు మాగజైన్
శ్రీకాళీగార్డెన్స్-522508

Printed, Published by C.V. Ramana Babu, on behalf of YOGINI SRI CHANDRA KALI PRASADA MATHAJI CHARITABLE TRUST and Printed at Samardha Sadguru Publications, D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh, and published at D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh. Editor - Guda Siva Rama Murthy,

ఈ సంచికలో.... పేజీ

# భద్రవాక్యం

**శ్లో ॥ పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో**
**నిర్వేద మాయా నాస్త్య కృతః కృతేన**
**తద్విజ్ఞానార్థం స గురుమేవాభి గచ్ఛేత్**
**సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్ ॥**

ఈ శ్లోకం ప్రథమ ముండకంలో ద్వితీయ ఖండంలోని పన్నెండవ మంత్రం. మోక్షసాధనలో బ్రహ్మవిజ్ఞానార్జనకు గురుదేవుని ఆవశ్యకతను గురించి ఈ మంత్రం నిర్ద్వంద్వంగా నిర్ణయం చేస్తున్నది. ఏదో ఒక సమయంలో తప్పక ప్రతి సాధకుడు కర్మాచరణకు ఫలంగా లభించే సమస్త లోకాలు ఎండమావుల వలె మిథ్య, గంధర్వ నగరము వలె అనిత్యములు స్వప్నతుల్యములు, నీటి బుడగలలాగ, నురగలాగ, క్షణభంగురములు, సారవిహీనములు అని ప్రత్యక్షాది ప్రమాణాల ద్వారా తెలిసికొని నిర్వేదం చెందుతాడు.

సాధకుడు అలా విరక్తి చెంది, సంసార జీవులకు లభించే అవ్యక్తం మొదలు స్థావరాంతం గల ఈ లోకాలతో తనకు పనిలేదని, అకృతమోక్షము కర్మాచరణం వలన పొందబడదని వైరాగ్య సంపన్నుడై, నిత్యము, అమృతము, అభయము, శివము, కూటస్థము, అచలము, ధృవము, మోక్షస్వరూపము అయిన జ్ఞానం కన్న ఇతరమైన దానిని దేనిని కాంక్షించక, ఆ విజ్ఞానాన్ని పొందటానికి సమిత్పాణియై, శమాది సంపన్నుడు, శ్రోత్రియుడు, బ్రహ్మనిష్ఠుడు, అయిన గురుదేవుని ఆశ్రయించాలి.

శ్రీ శంకర భగవత్పాదాచార్యులవారు **గురుమేవ అభిగచ్ఛేత్** అన్న దానికి తమ భాష్యంలో గురువునే అశ్రయించాలి అని, శాస్త్రజ్ఞానం కలిగిన వారైనా స్వతంత్రించి, స్వయంగా బ్రహ్మజ్ఞాన సముపార్జనకోసం పాటు పడరాదని స్పష్టం చేశారు. అలాగే గురువు విషయంలో కూడ, ఆత్మజ్ఞానానికి కర్మలకు విజాతి భేదం ఉంటుంది. గనుక కర్మనిష్ఠుడు, లేదా కేవలం తపోనిష్ఠుడు, లేదా జపనిష్ఠుడు కాక, శ్రోత్రియుడు, బ్రహ్మనిష్ఠుడు అయిన గురుదేవునే ఆశ్రయించాలి అంటారు. ఎందుకంటే కేవలం శ్రోత్రియులు అయిన గురువులు శాస్త్రాలను ఆధారం చేసికొని, శిష్యుల సందేహాలు తీర్చగలరు కాని, అనుభవాన్ని ప్రసాదించలేరు. శిష్యుణ్ణి సంసార సాగరం నుండి ఉద్ధరించలేరు. అలాగే కేవల బ్రహ్మనిష్ఠులు వారు తరించగలరుకాని, శాస్త్రోక్తంగా సందేహాలను రహితం చేసి ఇతరులను తరింపజేయలేరు. అందువలన సమిత్పాణి అయి, శిష్యుడు బ్రహ్మజ్ఞానార్జనం కోసం శ్రోత్రియుడు బ్రహ్మనిష్ఠుడు అయిన గురువును తప్పక ఆశ్రయించాలి.*

# అమ్మ ఆశీస్సులు

**మజ్జన్మనః ఫలమిదం మధుకైటభారే**
**మత్ప్రార్థనీయ మదనుగ్రహ ఏష ఏవ**
**త్వద్భృత్య భృత్య పరిచారక భృత్య భృత్య**
**భృత్యస్య భృత్య ఇతిమాం స్మర లోకనాధ ॥**

ఇది శ్రీముకుందమాలలోని శ్లోకము. శ్రీగురుదేవులు తరచు తమ దివ్య బోధామృతములో అందరూ ఇట్టి భావనలో ఉండాలని సందేశమును అందించేవారు.

హే మధుకైటభారే! నా జన్మకు ఈ ఫలమును ప్రసాదించు ప్రభూ! నా ప్రార్థనను ఆలకించి నన్ను అనుగ్రహించి ఇదియే నీ సేవకుని సేవకుడైనవాని పరిచారకుని భృత్యునికి సేవకుడైనవాని సేవకునికి సేవకుడనని నన్ను తలంపుము ప్రభూ! లోకనాధా! అని ప్రార్థిస్తే ఇందులోనే ఎంతెంతో సాధన నిండి పూర్ణమైయున్నది.

భగవంతుడు సర్వవ్యాపకుడు. అన్నీ మనకు అనుభవైక వేద్యమే కదా! సూక్ష్మదృష్టిని అలవరచుకొని, స్థూల దృష్టిని మాత్రము స్థూలమునకు ఎంత వరకు ధర్మమో అంతవరకే ప్రాముఖ్యత నిచ్చిన సూక్ష్మ ఇంద్రియమైన మనస్సు అన్నింటినీ ప్రకాశింపజేసే అతి సూక్ష్మము స్థూలములకెల్ల మూలము అయిన శ్రీగురు పరమాత్మను మనము అనుభవింపగలము. ఇదియే ఈ జన్మకు సార్థకత.

అట్టి శక్తిని, భక్తిని, అఖండ సాధనా సంపత్తిని శ్రీగురుదేవులు మనకు ప్రసాదించుగాక!

- మీ అమ్మ

# సంపాదకీయం

శ్రీకాళీ వనాశ్రమంలో భోగి, సంక్రాంతి పండుగలు ఎంతో భక్తి భరితంగా, వైభవంగా జరిగాయి. సహజసిద్ధమైన ప్రకృతిమాత ఒడిలో చూతవృక్ష ఛాయలలో జరిగిన ధనుర్మాస కార్యక్రమాలు ఎంతో హృదయంగమంగా ఉన్నాయి. జపమాల ప్రసాద తిరుప్పావై ప్రవచనం ఆధ్యాత్మికంగా బాగా ఆకట్టుకున్నది.

శంకర భగవత్పాదాచార్యులవారి ప్రబోధ సుధాకరంతో, సద్గురుదేవుల దివ్యలీలలతో మేళవిస్తూ, అవసరమైనప్పుడు మూలంలో నుంచి శ్లోకాలు ఉదహరిస్తూ, లోతులలోకిపోయి అంతరార్థాలను వివరిస్తూ డా॥వెంకట రమణ ప్రసాద్‌గారు చేసిన భాగవత ప్రవచనం అద్భుతంగా ఉంటే, మాతాజీవారి అనుగ్రహ భాషణములు కార్యక్రమానికంతటికీ హైలైట్‌గా ఉన్నాయి.

29 డిసెంబర్, 2008 నుండి ముంబై మహానగరంలో వర్లి, మార్కండేశ్వర దేవస్థానంలో శ్రీఅయ్యప్పస్వామి, సాయిబాబా మూర్తులను, శ్రీమాతాజీవారిని, ఇతర సాధుమహాత్ములను పూలపల్లకిలో వర్లి ప్రధాన వీధులలో ఊరేగించి స్థానికులకు సాధుమహాత్ముల దర్శన భాగ్యాన్ని కలిగించారు.

నవంబర్26వ తేదీ ఉగ్రవాదుల విధ్వంసకాండకు గురిఅయిన తరువాత ముంబై మహానగరంలో ఎన్నో భద్రతాపరమైన ఆంక్షలు అమలులో ఉన్నా, ఈ నగర పర్యటనోత్సవం అత్యంత వైభవోపేతంగా జరగటం నిజంగా గురుకృపా విశేషమే. ముంబైలో మాతాజీ సన్నిధానంలో భక్తసోదరులు శ్రీమనోజ్‌కుమార్‌గారు చేసిన ప్రవచనాన్ని సంక్షిప్తంగా ఈ సంచిక నుండి పాఠకులకు సంత్‌నామదేవ్ చరితామృతము అనే శీర్షిక క్రింద అందిస్తున్నాము.

ఈ నెల 23వ తేది మహాశివరాత్రి పర్వదినం. ఆశ్రమంలో తె॥జా॥ 3గంటలకు బృందావనంలో శ్రీగురుదేవులకు మహాభిషేకము, శ్రీసద్గురు పాదపూజ జరుగుతాయి. అనంతరం శ్రీరామ లింగేశ్వరస్వామివారికి నవరసాలతో, పంచామృతాలతో, మహన్యాసపూర్వకంగా, రుద్ర, నమక. చమక పారాయణతో దశశాంతులతో, ఏకాదశరుద్రాభిషేకము, సహస్రఘటాభిషేకము, పూజ జరుగుతాయి. రాత్రికి మహాకాళికా పరమేశ్వరీ, రామలింగేశ్వర స్వామివారి లీలా కళ్యాణ మహోత్సవం జరుగుతుంది. భక్తులందరికీ ఇదే మా ***ఆహ్వానం!***

\- గౌరవ సంపాదకుడు

# బాబూజీ ఉవాచ

(గత సంచిక తరువాయి) - స్వామి విజయేశ్వరానంద ప్రసాద్

అటువంటి మధుర ప్రేమ స్వరూపుడు, పరంజ్యోతి స్వరూపుడు అయిన నారాయణుడు దేవకీ వసుదేవులకు అష్టమ సంతానమై ఆవిర్భవించాడు. ఈ విషయాన్నే నారాయణోపనిషత్తు **బ్రహ్మణ్యో దేవకీ పుత్రో బ్రహ్మణ్యో మధుసూదనః** అని ఉద్ఘాటించింది. కాని గర్భనరకం అనుభవించలేదు. ఎందువలనంటే ఆయనకు చావు పుట్టుకలు లేవు. అర్ధరాత్రివేళ దేవకీవసుదేవులకు చెరసాలలో చతుర్భుజుడై దర్శనమిచ్చి, తన అవతార కారణాన్ని, ప్రయోజనాన్ని వారికి వివరించి, శిశువుగా జన్మించిన వెంటనే వ్రేపల్లెలో యశోదానందుల ఇంటికి తనను తరలించమని ఆదేశించాడు. మరుక్షణమే దేవకీదేవి పొత్తిళ్ళలో శిశువై నిలిచాడు.



ఆ దంపతుల ఆనందానికి మేరలేదు. కాని పిల్లవాడు లేస్తే కాపలావాళ్ళకు తెలుస్తుందే? తన చేతులకు సంకెళ్ళు ఉన్నాయే? చెరసాల ద్వారాలకు తాళాలు వేసిఉన్నాయే? ఎలా ఇతనిని చెరసాల నుండి దాటించి వ్రేపల్లెకు వెళ్ళగలను? అని ఒక్క క్షణం భయపడి 'శ్రీమన్నారాయణుడే శిశువై నా చేతుల్లో విరాజిల్లుతుండగా నాకు భయం ఎందుకు?' అని బిడ్డను చేతుల్లోకి తీసికొని బయలుదేరాడు.

లోకాలనే శోకరహితం చేసే ఆ సుశ్లోకునికి ఏడుపు ఎక్కడ నుంచి వస్తుంది? చిరునవ్వులు చిందించే ఆ చిన్నారిని తన చేతుల్లోకి తీసికోగానే, సంకెళ్ళు అవే ఊడిపోయాయి. కాపలావాళ్ళందరికీ ఎక్కడలేని తమోగుణం ముంచుకొచ్చి నిద్రలో మునిగిపోయారు. ఆ చిన్నారి ముద్దు మోము చూసిన కొలది ఆనందము, ఆయన చిన్నతనపు చిలిపితనము చూసే అదృష్టం తనకు లేదు కదా అనే దుఃఖం ఇలా దోదూయమానమైన చిత్తంతో దేవకీ వసుదేవులు ఊగిపోయారు.

తరువాత వసుదేవుడు ఆ బిడ్డను మేదరబుట్టలో పరుండబెట్టి, ఆ బుట్టను శిరస్సుపై పెట్టుకుని, బయటకు వచ్చాడు. విధివిలాసం ఎంత గొప్పది?

ఏడేడు పధ్నాలుగు లోకాలు తన బుజ్జి బొజ్జలో ధరించిన ఆ జీవనాధుడు మేదరబుట్టలో పడుకుని వెళ్ళవలసినచ్చింది కదా!అని వసుదేవుడు చింతించాడు. స్వామిని తన శిరస్సుపై మోయుటమా? ఆయన బరువుని ఎవరు మోయగలరు? అని అబ్బురపడ్డాడు.

సత్యభామ ఈ విషయంలోనే మోసపోయింది. ఆమె శ్రీకృష్ణుని తన ప్రాణం కన్న మిన్నగా ప్రేమించింది. కాని ఆయన ఎప్పటికీ తన ఒక్కదానికే దక్కాలని, ఆయన ప్రేమను మరెవ్వరికీ దక్కనివ్వకూడదని ఆమె స్వార్థంగా ఆలోచించింది. ఆయనను తన రూప లావణ్యంతో, ఆభరణాలతో, బాహ్యాడంబరాలతో ఆకర్షించుకోవాలని ప్రయత్నించింది.

రుక్మిణీదేవికి అవన్నీ ఎందుకు? ఆమెకు కృష్ణుని పవిత్రప్రేమయే దివ్యాభరణము. కృష్ణ ప్రేమను చూరగొనే హక్కు సకల జీవకోటికి ఉందని ఆమెకి తెలుసు. ఆయనను లోకేశ్వరునిగానే ఆమె ఆరాధించుకున్నదికాని, తన నాధుడుమాత్రమే అని ఎన్నడూ అనుకోలేదు. అది స్వార్థరహితమైన ప్రేమ. సత్యభామది స్వార్థ సహితమైన ప్రేమ. ప్రకృతిని ఎలా వశపరచుకోవాలో పరమాత్మకు తెలుసు. ప్రకృతి ఆయన ఛాయా స్వరూపమే కదా!

పారిజాత వృక్షం తేవటం కోసం సత్యభామా సహితుడై శ్రీకృష్ణుడు దేవలోకానికి వెళ్ళాడు. అక్కడ స్వామి మనవడు స్వామికోసమే వేచి ఉన్నాడు. నారదుడు సత్యభామను గూర్చి పట్టించుకోకుండా శ్రీకృష్ణపరమాత్మను 'నీవు సగుణబ్రహ్మగా అవతరించిన పరమాత్మవు, శక్తి సంపన్నుడవు. జీవకోటికి ఆధార స్వరూపుడవు' అని పొగడుతుంటే సత్యభామకు రోషం వచ్చి 'స్వామి పధ్నాలుగు లోకాలను మోసేవాడైతేనేం, నాకు విధేయుడే కదా! నా సంగతి పట్టించుకోవేమిటి?' అన్నట్లుగా నారదుని వంక చురచురా చూసింది.

స్వామి ఇదంతా క్రీగంటి చూపుతో గమనించనే గమనించాడు. చూడనట్లే ఉండి అన్నీ చూస్తూనే ఉంటాడు. ఆయన దృష్టి ఎక్స్‌రే ఫొటో కంటె గొప్పది. జగత్తులో ఎక్కడి విషయమైనా ఆయన దృష్టికందుతుంది.

సత్యభామ అహంకారం తగ్గించటానికి, రుక్మిణీదేవి పాతివ్రత్య మహిమ నిరూపించటానికి శ్రీకృష్ణపరమాత్మ నారదునితో కలిసి ప్లాన్ చేశాడు. ఆ పథకం ప్రకారంగా శ్రీకృష్ణపరమాత్మను ఒక త్రాసులో ఉంచి, ఆయనతో సమానమైన ధనంతో ఎవరు ఆయనను సరితూచగలిగితే వారికి ఆయన చెందేటట్లు ఒప్పందం జరిగింది.

-సశేషం

# మాతాజీ అభిభాషణ

(గతసంచిక తరువాయి) -జపమాల ప్రసాద

## శ్రీ గురుగణపతి తత్త్వం

శ్రీ సిద్ధి బుద్ధి వినాయకుడు ప్రథమ పూజితుడుగా మనందరి చేత ఆరాధింపబడుతున్నాడు. మన కోరికలని సిద్ధింపచేసి, మనకి ఆధ్మాత్మిక సాధన సిద్ధిని, అది చేయడానికి కావలసిన బుద్ధిని కూడా ప్రసాదించే దేవుడాయన. మనం ఏటేటా చేసే వినాయక చవితి పూజలో ఎంతో లోతైన తత్త్వం దాగివుంది. అది తెలుసుకుని మనం పూజ చేస్తే ఆనందం మన సొత్తవుతుంది.



జగన్మాత నుండి గణపతి శరీరం సృష్టించబడింది. కానీ పరమేశ్వరుడాతని శిరస్సుని ఖండించేసరికి, పార్వతీమాత ఆవేదన వర్ణనాతీతం. ఇది మనందరికి తెలిసిన కథే కనుక, మనం విశేషార్థాన్నే గమనిద్దాం. తన భక్తుడైన గజాసురుడికి యిచ్చిన మాట నిలబెట్టుకోవడానికై, పరమశివుడు గజాసురుడి యొక్క ఏనుగుతలని తాను ఛేదించిన పార్వతీ తనయుడికి అతికించి పునఃప్రాణ ప్రతిష్ఠ చేశాడు. ఇప్పుడా బాలుడు ద్విజన్ముడయ్యాడు. అమ్మనుండి శరీరం, అయ్యనుండి శిరస్సు పొందాడు. ఇదంతా నిజంగా జరిగే పనేనా అని ఇప్పటివారి విపరీతపు తర్కాలు వినిపిస్తూ వుంటాయి. సర్వశక్తిమంతుడైన భగవంతుడికి, అనంతశక్తికి అసంభవమనేది ఏదీ లేదు. అది అనుభవపూర్వకంగా తెలుసుకోవాలంటే మహాత్ములైన సత్యగురుదేవులని ఆశ్రయించి, వారు చెప్పినది తు.చ. తప్పకుండా ఆచరించాలి. మహాత్ముల మాటని పెడచెవిన పెట్టి, శాస్త్ర ప్రమాణాలని తీసిపారవేసి, మాకంటే తెలివైన వారు లేరని విర్రవీగుతూ, వ్యర్థప్రసంగాలు చేసేవారికి అనంతతత్త్వం ఏమర్థమవుతుంది? ఇప్పుడు డాక్టర్లు లివరు, హార్టు, మొదలయిన అవయవాలని మార్పిడి చేస్తున్నారు. మరి సర్వసృష్టికి నియామకుడైన పరమశివుడు ఆనాడే 'శిరస్సు మార్పిడి' చేశాడంటే వింతేమిటి?

ఆవిధంగా ఉమాసుతుడికి గజాసురుడి తలని అతికించి త్రిలోకపూజ్యంగా చేశాడు మహేశ్వరుడు. స్వజాతి, విజాతి, స్వగత భేదం లేని మహాత్ములకి ఏనుగని, మనిషని తేడాలేదు అన్నది నిరూపణ అయింది.

ఇక ఆ తరువాత గణాధిపత్యం ఎవరికివ్వాలనే ప్రశ్న ఎదురయింది. తమ్ముడైన షణ్ముఖుడికి, అన్నగారైన గణపతికి నాకు కావాలంటే నాకు కావాలని పోటీ మొదలయింది. అంటే అన్నదమ్ముల మధ్య వివాదాలు ఆనాటి నుంచే వచ్చాయన్న మాట అని అనవచ్చు. మనం ఆధ్యాత్మికంగా అర్థం చేసుకుంటే అటువంటి ఆలోచనలు రావు. ఇది మామూలు ఆస్తికోసం వచ్చిన తగాదా లాంటిది కాదు. సాక్షాత్ గురుస్వరూపుడైన తమ తండ్రి యొక్క అనంతతత్త్వానికి వారసులమవ్వాలని కోరుకోవడంలో తప్పేముంది? నాకు కావాలంటే నాకు కావాలని ఆ అన్నదమ్ములిద్దరూ వారిలో వారు పోట్లాడుకోలేదు. ఆదిగురువైన శంకరుని సన్నిధిలోనే వారి మనసుల్లోని మాట చెప్పి, తీర్పు అడిగారు. శంకరుడు కూడా, మీరిలా చేస్తే మీకీ ఫలితం వస్తుంది అని చెపుతాడు. సాధనలో ఇది చాలా ముఖ్యం. గురుమూర్తి చెప్పినది చెప్పినట్లు చేస్తే మనకి 100% మార్కులు వస్తాయి. సాధనలో 'నేను బాగా చేయాలి, నేను ముందుకి వెళ్ళాలి అని ప్రతి సాధకుడు ఎంతో ఉత్సాహంతో ముందుండాలి అని మనకీ కథ బోధ చేస్తోంది కనుక ఇక్కడ మనకి సంపూర్ణ గురుతత్త్వం ప్రకాశిస్తోంది.

మూడులోకాలు ఎవరయితే చుట్టి ముందు వస్తారో వారికి గణాధిపత్యం ఈయబడుతుందని చెప్తాడు పరమేశ్వరుడు. అది వినీ వినడంతోనే “ఓస్! ఇదెంత పని నాకు ! ఎక్కడికైనా క్షణంలో చుట్టిరాగలిగే నెమలి నా వాహనమై వుండగా నాకేంలోటు?” అని ఆ నెమలినెక్కి రివ్వుమని ఎగిరిపోయాడు షణ్ముఖుడు.

ఇక మన గణపయ్య ముఖం చిన్నబోయింది. “నాన్నగారూ, నా సంగతి తెలిసి కూడా ఇంతటి పరీక్ష పెట్టారా! నేను చూడబోతే పొట్టివాడను. నా వాహనమా ఎలుక! నేనెలా మూడులోకాలనీ చుట్టగలను?” అని తన బాధ వెళ్ళబోసుకుంటాడు గణపతి.

-సశేషం

# సన్నిధిలో సంభాషణ

(గతసంచిక తరువాయి) - పరాశర ప్రసాద్

**8-6-1984**

ఈ రోజు ఉదయం శ్రీబాబు మద్రాసు పామ్‌గ్రోవ్ హోటల్‌లో భక్తులకు దర్శనం ఇచ్చారు. శ్రీబాబు భక్తులను ఉద్దేశించి మాట్లాడుతూ పాపం మీరంతా నా కోసమే వచ్చారు. నిన్నటి నుంచీ బాబు స్మరణే చేస్తున్నారు. మీరంతా చదువుకొన్నవారు, పండితులు. కాబట్టి సాధన చాలా చక్కగా చేస్తున్నారు. ఆనందాన్ని పొందుతున్నారు. మీరు పొందే ఆనందాన్ని నేను చూస్తూనే ఉన్నాను అన్నారు. మీరంతా మీ పనుల కోసం వచ్చి ఎలాగూ వచ్చాం కదా బాబుని కూడా చూచివద్దామని వచ్చారు అంతేనాండీ ప్రసాదరావుగారూ? మీ విషయం కాదు లెండి. ఏదో పాపం తిరుపతిలో మీ స్నేహితులు ఉంటే వారిని కలుసుకుని వారితో మాట్లాడి మీ వ్యవహారాలు పూర్తిచేసికొని ఈ రోజు ఎలాగో రాగలిగారు. మీకు తిరుపతిలో తారకం కూడా కనబడ్డారనుకుంటాను. మీరిద్దరూ ఏదో సంభాషణ చేశారు. ఆ సంభాషణ అంతా బాబుని గురించేకదా! అని అడిగారు.

ప్రసాదరావుగారు మాట్లాడుతూ మేము మీరు చెప్పినట్లు తప్పక సాధన చేస్తాం బాబూ అన్నారు.

తారకంగారు మాట్లాడుతూ మీ దర్శనం కోసం వచ్చి మా స్వంత పనులు చూసుకోవటం పొరపాటే అని అన్నారు.

శ్రీబాబు మాట్లాడుతూ ఏ కాలం ఎలా వినియోగించుకోవాలో తెలిసికోండి. కాలం విలువని గుర్తించండి. గురుదేవుని అనుగ్రహం లేనిదే మీ భార్యాపిల్లల్ని మీరు రక్షించుకోగలుగుతారా? పోనీ మీ వ్యవసాయపు పనులు పూర్తి చేసికోగలుగుతారా? అంతా మేమే చేసేస్తున్నాము అనే భావన ఎందుకు కలుగుతోంది? అదే మాయ అంటే. మాయ అవకాశం కోసం చూస్తుంది. ఎప్పుడైతే నీలో బలహీనత బయలుదేరిందో మాయ నీలో ప్రవేశించి పంజాదెబ్బ కొడుతుంది. నీలో ఆధ్యాత్మిక శక్తి ఎప్పుడైతే బలహీనమైనదో అప్పుడు మాయ బలపడుతుంది. ఆధ్యాత్మిక శక్తిని అప్పుడు తేలికగా చూస్తావు. అది చివరికి నీ పతనానికి దారితీస్తుంది. అటువంటి మాయని జయించటానికే చతుర్విధ

శుశ్రూషలు చేయాలని సీతారామాంజనేయంలో చెప్పబడింది. గురుసాన్నిధ్యం అందుకే చాలా ముఖ్యం అని అన్నారు శ్రీబాబు.

ఇంతలో నారాయణరావుగారు శ్రీబాబును ప్రశ్నిస్తూ చతుర్విధ శుశ్రూషలు ఎవరు చేయాలి? అవి చేయటానికి మేము అర్హులమేనా? ఎలా చేయాలి? అని అడిగారు.

శ్రీబాబు మాట్లాడుతూ కాంతా కనకముల మీద వ్యామోహం ఉన్నవారు ఎన్నడూ చతుర్విధ శుశ్రూషలు ఆచరించలేరు. మనస్సుకి దాసులైనవారుగాని, ధనవ్యామోహము ఉన్నవారుగాని చతుర్విధ శుశ్రూషలు చేయలేరు. అలాగని ధనకాంక్ష ఉండకూడదని నా ఉద్దేశ్యం కాదు. నేను ఎన్నడూ అలా చెప్పను. మీకు కావలసినంత ధనాన్ని ఆర్జించవచ్చు. మీరు సుఖంగా ఉండవచ్చు. అంతవరకేగాని కాలాన్నంతా ధనార్జనకే వినియోగించి కాలాన్ని వృథా చేయరాదు. చతుర్విధ శుశ్రూషలంటే నా కాళ్ళు విరగ్గొట్టమని కాదు. మీ ధనాన్నంతా నాకు ఇవ్వమని ఎన్నడూ చెప్పను. మీకు కావలసినంత ధనాన్ని అందజేసే గురుదేవునికి మీరు ఇచ్చేదేమిటి? తనుమనోధనాలను సమర్పించటం అంటే మీ మనస్సు సదా ఆ పరమాత్ముని యందు ఉంచాలి.

శుశ్రూష అంటే ఏమిటి తారకం? అని ప్రశ్నించి 'సు' అంటే ఆత్మవస్తువు. 'ష' అంటే పరమాత్మ వస్తువు ద్వారా అంతఃకరణ శుద్ధి చెంది ఋషీశ్వరుడై ప్రకాశిస్తాడని అర్థం. కాదని ఇక్కడ ఉన్న పండితుల నెవరినైనా చెప్పమనండి చూద్దాం. చతుర్విధ శుశ్రూషల ద్వారా మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారములు సత్యం, శాంతి, దయ, ప్రేమగామారి అంతఃకరణ శుద్ధి చెందుతుంది. అటువంటివాడి హృదయం నుండి ఉద్భవించిన భావాలు ఎలా ఉంటాయి? 'ష' అంటే ఋషి అనే అర్థం వస్తుందా తారకం? అని ప్రశ్నించారు. అవును అన్నారు తారకంగారు. పరమాత్ముని కరుణకు పాత్రులైన మీరాబాయి వంటి ఋషీశ్వరులు ఎన్నడైనా మీ ధనాన్ని ఆశించారా? ఈ ధనంతో భగవంతుణ్ణి మెప్పించగలరా? అందువలననే కబీర్‌దాస్ తన కుమారుడు రామనామాన్ని గానం చేస్తూ ఎవరో ఒక ధనవంతుడు ఇచ్చిన రత్నం తెచ్చినందుకుగాను నేలమీదపడి దొర్లి 'నాయనా! ఎంతపని చేశావురా! రామనామాన్ని ధనానికి అమ్ముకుంటావా?' అని విలపిస్తాడు. వారి దృష్టి అలా ఉంటుంది.

- సశేషం

# శ్రీగీతా సూత్ర రత్నమాల

(గత సంచిక తరువాయి) -శ్రీ యోగేశ్వరానంద స్వామి

**44. సర్వభూతాశయస్థితాత్మా।**

ఆయన సర్వజీవహృదయ స్థితుడు.

**45. ఆదిత్యానాం విష్ణుర్జ్యోతిషాం రవిర్నక్షత్రాణాం శశీ। వేదానాం సామవేదో దేవానాం వాసవః ఇంద్రియాణాం మనో రుద్రాణాం శంకరో యక్షరక్షసాం విత్తేశోవసూనాం పావకశ్శిఖరిణాం మేరుః పురోధసాంబృహస్పతిః సేనానీనాం స్కంద స్సరసాం సాగరో మహర్షీణాం భృగురితి సర్వం తదేవ।**

ఆయనయే ద్వాదశాదిత్యులలో విష్ణువు, జ్యోతులలో సూర్యుడు, నక్షత్రములలో చంద్రుడు, దేవతలలో ఇంద్రుడు, ఇంద్రియములలో మనస్సు, ఏకాదశ రుద్రులలో శంకరుడు, యక్షరక్షోగణములలో కుబేరుడు, అష్టవసువులలో పావకుడు, శిఖరములు గల పర్వతములలో మేరువు, పురోహితులలో బృహస్పతి సేనానులలో కుమారస్వామి, జలాశయములలో సముద్రము, సప్తమహర్షులలో భృగువునై వెలయుచున్నాడు. ఈ రీతిగా సర్వశ్రేష్ఠ పదార్థములును ఆయనయే యని విభూతి ధ్యాన మొనర్పనగును.

**46. గిరామక్షరం యజ్ఞానాం జపయజ్ఞః స్థావరాణాం హిమాలయో వృక్షాణాం అశ్వత్థో దేవర్షీణాం నారదో గంధర్వాణాం చిత్రరథ స్సిద్ధానాం కపిలోzశ్వానా ముచ్చైశ్రవో గజేంద్రాణా మైరావతో నరాణాం నరాధిపో ఆయుధానాం వజ్రం ధేనూనాం కామధుక్ నాగానామనంతో యాదసాం వరుణః పిత్రూణా మర్యమా సంయమవతాం యమ ఇతి సర్వం తదేవ॥**

శబ్దములలో ఓంకారమును, యజ్ఞములలో జపయజ్ఞమును, స్థావరములలో హిమాలయమును, వృక్షములలో అశ్వత్థమును, దేవర్షులలో నారదుడును, గంధర్వులలో చిత్రరథుడును, సిద్ధులలో కపిలుడును, అశ్వములలో ఉచ్చైశ్రవమును, గజములలో ఐరావతమును, నరులలో రాజును, ఆయుధములలో వజ్రమును, ధేనువులలో కామధేనువును, నాగములలో అనంతుడును, జలదేవతలలో వరుణుడును, పితృదేవతలలో అర్యముడును, దండధరులలో యముడును అగుచు భగవంతుడే వెలయుచున్నాడు. సర్వశ్రేష్ఠ పదార్థములును ఆయనయేయని ధ్యానమొనర్పనగును.

-సశేషం

## శ్రీకాళీగార్డెన్స్‌లో విశేషపూజా కార్యక్రమములు

**ఫిబ్రవరి 2009**

**2 సోమ రథసప్తమి.**

**5 గురు భీష్మఏకాదశి,** శ్రీసద్గురుపాదపూజ, సత్సంగ సమావేశము. పెదనింద్రకొలనులో శ్రీసద్గురుదేవుల దివ్యమంగళ మూర్తి ప్రతిష్ఠా పంచమ వార్షికోత్సవం, శ్రీసద్గురుపాదపూజ, సత్సంగసమావేశం, భక్త సమారాధన.

**7 శని శనిత్రయోదశి**

**9 సోమ వ్యాసపూర్ణిమ**, సత్సంగం, శ్రీసద్గురుపాదపూజ, భక్తసమారాధన.

**19 గురు శ్రీగురుదశమి**, సత్సంగం, శ్రీసద్గురుపాదపూజ.

**23 సోమ మహాశివరాత్రి**. తె॥జా 3గంటలకు బృందావనంలో శ్రీసద్గురు దేవులకు అభిషేకం, 5గం.లకు శ్రీసద్గురుపాదపూజ. ఉదయం 11గం.లకు శివాలయంలో సహస్రఘటాభిషేకం, లక్షబిల్వార్చన, భక్తసమారాధన. సాయంత్రం ఊరేగింపు. రాత్రి 8గం.లకు శ్రీమహాకాళికాపరమేశ్వరీ రామలింగేశ్వరస్వామి సామూహిక కళ్యాణ మహోత్సవం.

**27 శుక్ర** శ్రీలలితానంద సరస్వతివారి ద్వాదశవార్షికారాధన మహోత్సవం. ఉదయం 11గం.లకు శ్రీసద్గురుపాదపూజ. సత్సంగసమావేశం.

**మార్చి 2009**

**10 మంగళ పూర్ణిమ, హోలీపండుగ** శ్రీసద్గురుపాదపూజ

**20 శుక్ర శ్రీగురుదశమి** సాయంత్రం 6గం॥శ్రీసద్గురుపాదపూజ, సత్సంగ సమావేశము.

**25 బుధ మాసశివరాత్రి**

**27 శుక్ర ఉగాది శ్రీవిరోధినామ సంవత్సరారంభం**, పంచాంగ శ్రవణం, శ్రీసద్గురుపాదపూజ, సత్సంగసమావేశం, భక్తసమారాధన.

అఖిలాంధ్ర సాధుపరిషత్ 44వ వార్షిక మహాసభలు కరీంనగర్ జిల్లా, గాగిళ్ళాపురం శ్రీధ్యాననిష్ఠాశ్రమ ఆవరణలో 2009 ఫిబ్రవరి 26,27,28 తేదీలలో పరిషత్తు అధ్యక్షులు పూజ్యపాదులు ఆచార్య శ్రీశ్రీశ్రీ పరిశుద్ధానందగిరి స్వాములవారి ఆధ్వర్యవమున జరుగును. ఇందు అనేకమంది సాధుపుంగవులు, పీఠాధిపతులు, మఠాధిపతులు పాల్గొని ధార్మిక ప్రసంగములను గావింతురు. కావున సర్వులు పాల్గొని పరమానంద ప్రాప్తిని బడయుదురు గాక!

# సత్సంగ సౌరభం

(గతసంచిక తరువాయి) -రమణ ప్రసాద్

భగవంతుడంటే అందరికీ ఇష్టమే. కాని దేవునికి ఇష్టమైనవాళ్ళు ఎంతమంది ఉంటారు? దేవుడు తనకు ఎవరంటే ఇష్టమో చెబుతున్నాడు. ఆ లక్షణాలు మనలో ఉంటే మనంకూడా స్వామికి ఇష్టులమవుతాం. అన్ని దిక్కులలోను,అన్ని రూపాలలోను ఆయనే నిండి ఉన్నాడు. **ఈశావాస్యమిదగ్ం సర్వం యత్కించ జగత్యాం జగత్** అని ఈశావాస్యోపనిషత్తు చెబుతోంది. "నేను అందరినీ చూస్తున్నాను. అది నీకు తెలియాలంటే నీ చూపు నాచూపుతో కలవాలి" అంటాడు భగవంతుడు. అద్దంముందు నిలిస్తే మీ ప్రతిబింబం అద్దంలో కనపడుతుంది. అది మీరు అద్దంవైపు చూస్తేనే తెలుస్తుంది**. పరస్పరం భావయంతః** భగవద్గీతలో భక్తియోగంలో 8 శ్లోకాలలో తనకు ఎవరు ఇష్టమో చెప్పాడు గీతాచార్యుడు. భగవంతుడికి మనం తెలియాలంటే భగవంతునికి ఇష్టమైన పనులు చేయాలి. శ్రీకృష్ణుడు అర్జునునితో

**యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసియత్।**
**యత్తపస్యసి కౌన్తేయ తత్కురుష్వ మదర్పణమ్ ॥**

అన్నాడు. అర్జునా! నీవు చేయునది ఏదో, తినునది ఏదో,హోమం చేయునది ఏదో, దానం చేయునది ఏదో వాటిన్నటినీ నాకు అర్పించు. ప్రహ్లాదుడు అలా చేశాడు. పానీయంబులు ద్రావుచున్, కుడుచుచున్ - ఏది చేసినా భగవదర్పణంగా చేశాడు.

**అనన్యచేతాస్సతతం యోమాంస్మరతి నిత్యశః**
**తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్యయోగినః**

అర్జునా! ఎవడు సర్వకాలములందు వేరు వేరు విషయములపై మనస్సు పోనీయక నన్నే స్మరిస్తూ నాతో నిత్య యోగమును కోరుకుంటాడో అటువంటి యోగి నన్ను సులభంగా పొందుతాడు. అతనిని వదలి ఉండలేక నేనే అతనిని అనుసరిస్తాను, అన్నాడు భగవానుడు.

సృష్టి చేసినప్పుడు బ్రహ్మదేవుడు అన్నిజీవరాసులకు 40 సంవత్సరాల ఆయుర్దాయం ఇచ్చాడు. కాని మానవుడు తాను ఇంకా ఎక్కువ కాలం జీవించాలని బ్రహ్మదేవునితో మొరపెట్టుకున్నాడు. బ్రహ్మ చెప్పిన ప్రకారం అతడు గాడిదను, కుక్కను, గుడ్లగూబను ఆయుర్దాయంకోసం అడుగుతాడు. ఆ జంతువులు తమకు 40 సంవత్సరాలు ఎక్కువ అని తలో 20 సంవత్సరాల ఆయువును మానవుడికి ఇస్తాయి. ఆవిధంగా మానవుడి ఆయువు 100 సంవత్సరాలైంది.

అయితే 40 సంవత్సరాలే ఒరిజినల్.40నుంచి 60 దాకాగాడిద జీవితం. అంటే అల్లుళ్ళను వెదకటం, పిల్లలను మోయటంలాంటి పనులు చేస్తాడు. 60నుంచి 80 వరకు ముసలితనం వచ్చి ఎప్పుడు కోడలు పిలుస్తుందా, ఎప్పుడు ఇంత ముద్ద వేస్తుందా అని గుమ్మంవద్ద కుక్కలాగా ఎదురు చూస్తాడు.80నుంచి 100 వరకుచూపు సరిగ్గా ఆనక గుడ్లగూబలాగా జీవిస్తాడు. మానవుడికి తనకు లభించిన నూరేళ్ళ జీవితంలో సగభాగం నిద్రలో పోతుంది. 25 ఏళ్ళు బాల్యంలో, వృద్ధాప్యంలో గడిచి పోతుంది. మిగిలిన 25 ఏళ్ళు వ్యాధులతో, రోగాలతో గడుస్తుంది. అయితే మరి భగవంతుడిని ఎప్పుడు స్మరించాలి? దానికి భగవానుడు **సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్యచ** అంటాడు 'అంటే నిరంతరము సర్వకాలములందు మరణమువచ్చే వరకు నన్నే స్మరిస్తూ కర్మలు చేస్తూ ఉండు. నాకే మనస్సును అర్పించి నన్నే స్మరించేవాడు నన్నే పొందుతాడు. అటువంటి వాళ్ళంటే నాకు ఇష్టం' అన్నాడు శ్రీకృష్ణుడు.

కరాగ్రంలో లక్ష్మి, కరం మధ్య సరస్వతి, కరం మొదట (మణికట్టు) పార్వతి ఉంటారు. తెల్లవారుఝామున మీ చేతిలో లక్ష్మి, సరస్వతి పార్వతులను దర్శించండి. హరి పాదం దర్శించండి. ఇక దరిద్రం మీ దరికి రాదు. భగవంతుడు భక్త సులభుడు. మనం ఏది ఇచ్చినా అది ప్రీతితో స్వీకరిస్తాడు.

**పత్రం, పుష్పం, ఫలం తోయం యో మే భక్త్యాప్రయచ్ఛతి।**
**తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః॥**

'పత్రం, పుష్పం, ఫలం,జలం వీటిలోదేనినైనా సరే భక్తితో నాకు అర్పిస్తే వాటిని నేను ప్రీతితో స్వీకరిస్తాను' అంటున్నాడు భగవానుడు. శబరి ఏమి ఇచ్చింది? ఆమె శ్రీరామునిరాకకై ఎదురు చూస్తూఉన్నప్పుడు ఆమె కళ్ళనుండి నీరు కారుతుంటే ఆమె ఆ కన్నీళ్ళను తిడుతుంది, 'నేను ఇన్నాళ్ళుగా నా స్వామికోసం ఎదురు చూస్తుఉంటే, నా కంటే ముందుగా మీరు నా రామప్రభువును చూద్దామనుకొంటున్నారా' అని.

**సర్వస్యచాహం హృది సన్నివిష్టో మత్తఃస్మృతిర్జ్ఞానమపోహనం చ।**
**వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో వేదాన్తకృద్వేద విదేవ చాహమ్॥**

'నేను సర్వ ప్రాణుల హృదయాలలో అంతర్యామిగా ఉన్నాను. నా వలననే స్మృతి, జ్ఞానము, వాని నాశము కలుగుతున్నాయి. వేదములచేత ఎరుగబడేవాడను నేనే. వేదోక్త కర్మలకు ఫలములనిచ్చేవాడిని నేనే. వేదార్థమునెరిగినవాడిని నేనే' అంటాడు భగవానుడు. అహంకారం నశింపచేసికొని నాయందు అనన్యభక్తి కలిగినవారంటే నాకు ఇష్టం అన్నాడు భగవానుడు. అట్టి అనన్యభక్తిని సాధనా సంపత్తిని మీకందరికీ గురుదేవులు ప్రసాదించెరుగాక!!

# సంత్ నామదేవ్ చరితామృతం

-మనోజ్ కుమార్

(ముంబై నగరంలో భక్తసోదరులు శ్రీగోపిగారి నివాసంలో శ్రీమాతాజీవారి సన్నిధిలో భక్తసోదరుడు శ్రీమనోజ్‌కుమార్ చేసిన ఆధ్యాత్మిక ప్రసంగాన్ని సంగ్రహంగా పాఠకులకు ఈ శీర్షిక క్రింద ఈ సంచిక నుంచి అందిస్తున్నాము. -ఎడిటర్)

వర్షం అంతటా కురుస్తుంది. అయితే అందులో ఏ మూడు శాతమో భూమిమీద పడుతుంది. అందులోనూ కొంత అరణ్యాలలోను, కొండలపైన పడుతుంది. కొందరు కాల్వలు, చెరువులు త్రవ్వి, నదులకు ఆనకట్టలు కట్టి ఆ నీరు అందరికి అందాలి అని చూస్తారు.

ఒకసారి శ్రీగురుమహరాజ్ మాకందరికీ చాక్లెట్లు పంచిపెట్టారు. మేమందరం వాటిని తిన్నాక ఎలా ఉన్నాయి? అని అడిగారు. అందరం మధురంగా ఉన్నాయని చెప్పాము. "నేను మీకు అందిస్తున్న బోధకన్న మధురంగా ఉన్నాయా? చాక్లెట్లమీద ఉన్న ఆసక్తిలో కనీసం పదిశాతం అయినా గురుదేవుల బోధమీద ఉంటే ఎంత బాగుంటుంది?" అన్నారు.

గురుబోధ ప్రాక్టికల్‌గా, సందేశాత్మకంగా, అనుభవాన్ని కలిగించి, ఆ అనుభవం ద్వారా అందించబడేదిగా, హృదయానికి హత్తుకొనేలా ఉంటుంది.

చోఖామేళుడు పండరినాధునికి పరమభక్తుడు. ఆయన పెద్దకులస్థుడు. (శ్రీగురుదేవులు 'మాదిగ' అని తమ నోటితో ఎప్పుడూ అనలేదు. ఎప్పుడైనా ఆ పదాన్ని ఉచ్చరించవలసి వస్తే పెద్దకులం అని ఎంతో ఆదరపూర్వకంగా, వినమ్రంగా అనేవారు.)

చోఖామణి పండరినాధుని అంతరంగ భక్తులలో ఒకడు. నామదేవుడు అంటాడు, 'చోఖా అంటే శుద్ధమైన మేలిమి బంగారం, చోఖామణి మనస్సు గంగాజలం కన్న నిర్మలమైనది పవిత్రమైనది. చోఖామణి మనస్సులో అహంకారం మచ్చుకైనా లేదు' అని.

అగ్రకులాలవారమని గర్వంగా చెప్పుకొనే వారిలో కూడా ఎందరి నోటివెంటనో భగవన్నామం బదులు అశ్లీలపదాలు, తిట్లూ, శాపనార్థాలు వస్తుంటే, ఈ అంత్యజుని నోటి నుండి ఎంతో అద్భుతమైన,

అమృతప్రాయమైన, మధురమైన అభంగాలు మాత్రమే వచ్చేవి. అతనికి విఠలుడిపై గల భక్తి ఆ మధురమైన అభంగాలకు ఇంకా మాధుర్యాన్ని సంతరించేది. చోఖా పరవశించి మధురంగా అభంగాలు పాడుతుంటే, అతని భార్య సోయరాబాయి రెండు చెక్కలు పట్టుకొని తాళం వేస్తూ తనువు మరచేది.

చోఖాలో పండరినాధుణ్ణి దర్శించాలి అన్న ఆవేదన తీవ్ర రూపం ధరించి అతడు విఠలుణ్ణి దర్శించుకోవటానికి పండరివెళ్ళాడు. అక్కడ పూజారి గారు చోఖా గుడిముందు నిలబడటానికి కూడా ఒప్పుకోలేదు. చోఖా నీడ పడితే కూడా ఆలయం, ఆలయంలో పాండురంగడు మైలపడిపోతారని ఆయనను మైలు దూరంలో ఉంచేవాడు. ఇలా పదిసార్లు జరిగిన తరువాత ఇక ఏమి చేయాలో పాలుపోక చివరకు పదకొండవసారి చోఖా పండరినాథుడితో నేరుగా మొరపెట్టుకున్నాడు.........

**చోఖా** - అయ్యా! ఈ పెద్దలు నన్ను నీ ఇంటికి రానియ్యటం లేదయ్యా. నేను నీ విరహం భరించలేకుండా ఉన్నాను. ఇక నీకు తప్పదు, నీవే ఈ పేదవాడి గుడిసెకు వచ్చి దర్శనం ఇయ్యాలి. ఇంటిది కూడా నిన్ను చూడాలని ఎంతో ఆశగా ఉన్నది.

**పాండు** - అలాగే లేరా. నేనే వస్తున్నాను మీ ఇంటికి.

**చోఖా** - ఎప్పుడు?

**పాండు** - ఇవ్వాళ మధ్యాహ్నమే. మధ్యాహ్నం మంగళవేఢలో నీ ఇంటికి వస్తున్నాను. భోజనాలకు ఏర్పాట్లు చెయ్యి.

చోఖామేళుడు ఆనందంతో నృత్యం చేస్తూ అందరికీ పాండురంగడు మధ్యాహ్నం తన ఇంటికి ఇంటికి వస్తున్నట్లు చెప్తాడు. అందరూ అతడిని ఒక పిచ్చివాడి క్రింద జమకట్టి గేలిచేస్తారు. పండితులు పరిహసిస్తారు. చోఖామణిది చెక్కు చెదరని విశ్వాసం. స్వామి మాట ఇచ్చాడు. ఆయన తప్పక వస్తాడు అంటాడు. అందరూ అతనిని ఇంకా హేళన చేస్తారు. వాళ్ళందరికి చోఖా కులం మాత్రమే తెలుసు. భగవంతుణ్ణే రప్పించుకో గలిగిన అతని భక్తిని గురించి ఏం తెలుసు?

ఆడి తప్పటం అలవాటు లేని పండరినాధుడు రుక్మిణితో, సత్యభామతో మంగళవేఢ మాదిగవాడలో చోఖా గుడిసెకు వచ్చాడు. చోఖా, సోయరబాయి దంపతులు ఉబ్బితబ్బిబ్బయ్యారు. విఠలుడి పాదాలను

కన్నీటితో అభిషేకించారు. విఠలుడు గుర్తుచేశాడు, 'చోఖా! త్వరగా భోజనాలు వడ్డించండి. మేము వెంటనే తిరిగి వెళ్ళిపోవాలి'. ఆ పేదవాళ్ళ దగ్గర ఏముంటుంది? కాస్త అన్నం వడ్డించి, అందులోకి కొంచెం పులిసిపోయిన పెరుగు ఉంటే దానినే వడ్డించబోయింది సోయరాబాయి. అయితే తత్తరపాటు వల్ల గరిట చేతిలో నుంచి జారి ఆ పెరుగంతా పాండురంగడి పట్టు పీతాంబరం మీద పడుతుంది. చోఖా వెంటనే భయం భయంగా.......

**చోఖా** - స్వామీ! అపరాధం అయిపోయింది. చూసుకోలేదు.

**పాండు** - ఒరేయ్ చోఖా! ఇందులో నీ తప్పేమీ లేదు. ఇవ్వాళ వాళ్ళు గుళ్ళో పెరుగుతో అభిషేకం చేయలేదురా. నీవు ఎలాగూ అభిషేకం చేసుకోవాలని అనుకున్నావుగా. మరి నీ కోర్కెను నేను తీర్చవద్దా. ఒరే! నిజంగా ఇప్పుడు నాకు ఎంతో సంతోషంగా ఉందిరా.

ఏవో అస్పష్టమైన మాటలు, చోఖా సంభాషిస్తున్నట్లు వినబడుతుంటే. ఒకవేళ పాండురంగడు నిజంగానే వచ్చాడేమో అని పండితులు తలుపు తోసుకుని చోఖా గుడిసెలోకి ప్రవేశిస్తారు. కాని వారి కళ్ళకు అక్కడ విఠలుడు గాని, రుక్మిణిగాని, సత్యభామగాని ఎవరూ కనిపించరు. చోఖా అబద్ధాలు చెబుతున్నాడని అందరూ అతని లెంపలు వాయిస్తారు. తరువాత వాళ్ళు గుళ్ళోకెళ్ళి చూసినప్పుడు అక్కడ వారికి పాండురంగడి చెంపలు వాచి కనిపిస్తాయి. అంతేకాదు పీతాంబరం పైన అంతా పెరుగు మరకలు.

పండితులకు ఏం జరిగిందో సంజ్ఞ కలుగుతుంది. చోఖామేళుడి భక్తి ఎంత గొప్పదో తెలిసివస్తుంది. వారు వెంటనే చోఖా వద్దకు వెళ్ళి అతని పాదాలపై పడి క్షమాపణలు చెప్పుకొని శరణువేడుకొంటారు.

ఇది కట్టుకథ కాదు. నిజంగా జరిగింది. భగవంతుడి లీలలు. సమర్థులైన సద్గురుదేవుల లీలలు అలా ఉంటాయి.

రెండు రకాల గురువులు ఉంటారు. పాజిటివ్, నెగటివ్. విష్ణువు వామన రూపంలో వచ్చాడని తెలిసి, అతనికి దానం ఇవ్వబోతున్న బలిచక్రవర్తికి అడ్డంపడ్డ శుక్రాచార్యుల వంటివారు నెగటివ్ గురువులు. దత్తాత్రేయుల వంటివారు పాజిటివ్ గురువులు.

-సశేషం

# మౌనధ్యాన సప్తాహశిబిరం

-రమణ ప్రసాద్

**ధ్యానమూలం గురోర్మూర్తిః పూజామూలం గురోః పదం ।**
**మంత్రమూలం గురోర్వాక్యం ముక్తిమూలం గురోఃకృపా॥**

మనం మన ఇంటికి వెళ్ళటానికిత్రోవను వెతుక్కుంటున్నాం. ఆ వెతుక్కోవటమే ధ్యానం. అది మన ఇల్లే. గురుదేవుడు మనందరివాడే. ఆయనఏది అయిఉన్నారు? **మయ్యేవ సకలం జాతం...** ఆయననుండే అంతా ఉద్భవిస్తోంది. సృష్టి ఎక్కడ మొదలవుతుందో, ఎక్కడ ప్రకాశిస్తోందో, ఎక్కడ లయిస్తుందో, అందులోనే మనం ఉన్నాం.

ధ్యానంలో సహజంగా మనస్సు నిలిచినవాడి స్థితి ఎలా ఉంటుంది? నువ్వు నిద్ర పోయావు. నిద్రనుంచి లేచాక నువ్వు "చాలా హాయిగా నిద్ర పోయాను. నాకు ఏమీ తెలియలేదు'' అంటావు. హాయిగా నిద్ర పట్టిందని ఎవరు చెప్పారు? నీలో ఒకటి తెలుసుకొని చెపుతున్నది. దానికి నిద్ర లేదు. ఆ స్థితిని ఎవరు గుర్తించారు? కలను నిద్ర అనం కదా.

గురుదేవుల సన్నిధిలో మనస్సు ఏకాగ్రమవుతుంది. భగవన్నామంపై మనస్సు నిలిస్తే మనస్సు ఏకాగ్రమవుతుంది. మనస్సులో ఆలోచనలు వస్తే మనస్సు నిలబడినట్లుకాదు. దానికి విశ్వాసం, నమ్మకం ఆరూఢంగా ఉండాలి. నా గురుదేవులు సర్వాంతర్యామి. నా గురుదేవులు లేని అణువు లేదు అని నమ్మినవాళ్ళకి మనస్సు తేలికగా నిలబడుతుంది

**మనసు మాయ తొలగించగా, తనువు తీపి తొలగించగా**
**మార్గమొక్కటే యోగ సాధనం, అందుకోండి ఈ గురునామం**

సద్గురు పాదములను సేవించి, సద్గురు పదములనువిని సద్గురు పదమును పొందాలి. సద్గురుదేవుల పదములపై మనస్సు నిలిచినప్పుడే సార్థకత. సంకల్పం చేసే మనస్సు నువ్వు ఆశ్రయించిన నీ గురుదేవుని పాదాలయందు నిలిచిప్పుడే సార్థకత. తనువును విడిచి చైతన్యం తప్పుకుంటే మనస్సు ఇంకో ఉపాధికోసం వెతుక్కుంటుంది. అందుకే మానవుడు తన స్వరూపాన్ని తనువు ఉండగానే తెలిసికోవాలి. దానికి ధ్యానం తోడ్పడుతుంది. కాని ఆ ధ్యానం నిలబడాలంటే గురుమూర్తిని మనస్సులో నిలుపుకోవాలి. శరీరం ఉండగానే ముక్తిని పొందాలి. **ముక్తిమూలం గురోఃకృపా।** ఆ కృపకు రూపం ఉన్నదా? కాని ఆ కృప మనపై అనంతంగా వర్షిస్తూ మనను రక్షిస్తూనే ఉంది. అది మన అదృష్టం. కాబట్టి సాధకుడు ధ్యానంలో మనస్సు లయింపచేస్తే మనస్సు ఆ మకరందాన్ని

పొందుతుంది. **మయ్యేవసకలంజాతం మయిసర్వం ప్రతిష్టితమ్** (కైవల్యోపనిషత్తు) నానుంచే అన్నీ పుట్టి ప్రకాశించి నాయందే లయిస్తున్నాయి. శ్రీ శంకరాచార్యులవారి బోధ ఇదే. మీరాతల్లిని ఏ శరీర సంబంధ భాంధవ్యాలు బంధించాయి? అలాగే కబీరు, నామ దేవుడు, జ్ఞానదేవుడు ఇలా ఎంతోమంది మహాత్ములు అనేక దుఃఖాలు అనుభవించారు. అయినా ప్రపంచ విషయాదులను లెక్క చేయలేదు. శ్రీ ఆంజనేయస్వామి వారికి శ్రీరాముని యందు గల అకుంఠిత భక్తిని గురించి పాడుకొన్నాము.ఎంతటి మహాభక్తుడండీ ఆయన? తన గుండె చీల్చి తన దైవమైన శ్రీరాముని చూపించాడు.

రావణ సంహారం తర్వాత విభీషణుడు పట్టాభిషక్తుడైనా శ్రీరాముడు అతనికి ముందే లంకారాజ్యాన్ని దత్తం చేశాడు. అంటే రావణుడు అప్పుడే చచ్చిపోయాడన్నమాట. రావణ సంహారం జరిగి విభీషణుడు రాజైన తరువాత అందరూ అయోధ్యకు వచ్చారు. మనంకూడా వచ్చాము. భగవంతుడు ఉంటే భక్తుడు ఉండాలి. గురువు ఉంటే శిష్యుడు ఉండాలి. వారి గురించి మనమే చెప్పుకోవాలి. భగవంతుడు చెప్పడు. భగవన్నామ రసామృతాన్ని పొందే యోగ్యత మనకే ఇచ్చాడు. శ్రీరామచంద్ర ప్రభువు అందరికీ బహుమానాలు ఇస్తున్నాడు. హనుమంతునికి ఏమీ ఇవ్వలేదు. "నేను నీ వాడనే. నేను నిన్ను విడిచి లేను. నేను నీతోనే ఉన్నాను. నీలోనే ఉన్నాను'' అనే అనుభూతిని గొప్ప బహుమానంగా ఇచ్చాడు. దానిని గుర్తిస్తే చాలు. ధ్యానం వెంటపడి వస్తుంది. సీతాదేవి 'స్వామీ మన హనుమకు ఏమి ఇస్తున్నారు?' అంటే 'దేవీ! అది నీ వంతు' అన్నాడు శ్రీరాముడు. తనకు ఎంతో ప్రియమైన ముత్యాలహారం హనుమ మెడలో వేసింది. కొంత సమయం తరువాత అమ్మ చూసేసరికి హనుమ ఒక్కొక్క ముత్యం కొరికి, చూసి అవతల పారేస్తున్నాడు. అమ్మకి చాలా కోపం వచ్చింది. "నాకు ఎంతో ప్రియమైనహారాన్ని ఎంతో ప్రేమగా ఇస్తే ఇలా కొరికి పెడతావా'' అని ప్రశ్నించింది. "ఇందులో నా రాముడు ఉన్నాడా అని చూస్తున్నానమ్మా వీటిలో ఎక్కడా కనిపించలేదు'' అన్నాడు హనుమ. "అయితే ఎక్కడ ఉన్నాడో చూపించు'' అంది అమ్మ. ఇదిగో ఇక్కడ ఉన్నాడు'' అని తన గుండె చీల్చి చూపించాడు. భగవంతుడు సర్వే సర్వత్రా అన్నిట్లోనూ ప్రకాశిస్తూ ఉన్నాడు అనే భావన మనలో నిండుగా మెండుగా ఉండాలి అని మహాత్ములు మనకు ఈ శాంతి మంత్రం ప్రసాదించారు.

**పూర్ణమదఃపూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే ।**
**పూర్ణస్యపూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే ॥**

ఆ స్వరూపం అఖండమైనది, అనంతమైనది. ఆ ప్రకాశం పూర్ణంగా ప్రకాశిస్తోంది. ఆ అనంతమైన పరంజ్యోతి పూర్ణం. అందులోంచి ఏమైనా తీసినా, ఉంచినా పూర్ణమే. "ఒక దీపంనుంచి ఇంకొక దీపం వెలిగిస్తే ఆ దీపం వెలుగూ తగ్గదు, ఈ దీపం వెలుగూ తగ్గదు." అని గురుదేవులు తేలిక మాటలలో చెప్పారు. ఇన్ని ఉపాధులలో అది లేకుండా ఉందా?ప్రతి అణువుకూడా తనే అయి ప్రకాశిస్తున్నది. అది దాగి ఉండేదికాదు. దాచినా దాగేది కాదు. మనస్సు మాయ చేస్తుంది.అదే అజ్ఞానం. చీకటి గదిలో బ్యాటరీ లైటు వెలిగిస్తే చీకటి ఎలా పోతుందో, అజ్ఞానం గురుదేవుల అనుగ్రహంతో అలా పోతుంది. మాయ అనే జగత్తును దాటాలంటే భగవంతునియందు భక్తి శ్రద్ధలు కలిగి మనస్సుని ఏకాగ్రం చేయాలి.

తెలిసి రామ చింతనతో నామము చేయవే ఓ మనసా

తలపులన్ని నిలిపి నిముషమైన తారకరూపుని నిజ తత్త్వమును ॥తె॥

తలపులు అంటే సంకల్పాలు. అవి మనలోనుంచే వస్తాయి. నిజ తత్త్వము. ఇన్ని జ్యోతులు నిజంగా ఉన్నాయా? ఉన్నది ఒక్కటే? **ఘటవద్వివిధాకారః** నెలపొడుపు వస్తే చంద్రుని ప్రతిబింబం అన్ని కుండలలో అర్ధ చంద్రాకారంగా భాసిస్తుంది. పౌర్ణిమి వస్తే బ్రహ్మాండంగా ప్రకాశిస్తుంది. దానికి ఆధారం ఒకడే కదా! సంకల్పాలు, వికల్పాలు ఎప్పుడూ ఉంటాయి. వాటిని సంకల్పబలంతో నిగ్రహించాలి. ఎప్పుడూ సంతోషంగా ఉండాలి.

మనం చేసే పూజ యొక్క అంతరార్థాన్ని గ్రహిస్తే ఎక్కడైనా, ఎప్పుడైనా చేసుకోవచ్చు. మనం చేసేది భగవత్పరమై ఉండాలి. ఒకచోట కూర్చున్నా మనస్సు పరిగిడితే అది కర్మ. ఎక్కడఉన్నా ఏది చేస్తున్నా మనస్సు భగవంతుని దివ్యచరణారవిందాలపైనిలబడితే అది అకర్మ. మనస్సు లేకుండా చేసే పూజ పత్రి చేటు. పూజ భక్తులు తెచ్చుకొన్న సామాగ్రితోనే చేయించాలి అనేవారు గురుదేవులు. మనస్సు భగవదాయత్తం చేసినవాని చిత్తమేరీతిఇతరమ్ము చేరనేర్చు? అన్నాడు ప్రహ్లాదుడు తన తండ్రి అయిన హిరణ్యకశిపునితో.

అటువంటి మత్త చిత్తం కావాలి. ఆ పాదం లేని మనసు ఉన్నదా? గుర్తించేవాడిదే సౌభాగ్యం. గురుబోధామృతంద్వారా దానిని విశ్వాసంతో ఎవరు గుర్తిస్తారో వారి బ్రతుకు బంగారుబాట. అటువంటి విశ్వాసాన్ని ఆరూఢం చేసికోవాలి. **తత్ర బ్రహ్మోహమస్మి. అహంబ్రహ్మాస్మి** - మనం వారిలోనే ఉన్నాం. ఏ పనిలో ఉన్నా, ఏ ధర్మంలో ఉన్నా, గృహస్థు అయినా, మహారాజు అయినా ఆ మకరందాన్ని అనుభవించగలము. ధ్యానం ద్వారానే మన నిజస్థితి తెలుస్తుంది. అట్టి శక్తిని, భక్తిని, ఆత్మానందాన్ని సద్గురుదేవులు ప్రసాదించెదరుగాక! సుఖీభవ! సుఖీభవ!!

# బంగారు పిచ్చుక

(గతసంచిక తరువాయి) -పరాశర ప్రసాద్

విజయవాడ హాస్పిటల్‌లో ఒకనాటి ఉదయం నాతో మాట్లాడుతూ ఈ హంస హై .... అని ఎగిరిపోతుంది. మరి నీ కొడుకు సంగతి ఏమిటి? అని అనగానే నాకు ఆశ్చర్యమేసింది. 'ఏమిటి అలా మాట్లాడుతున్నావు? ఎక్కడకి ఎగిరిపోతావు? అని మాత్రం అనగలిగాను. ఆవిడ సంబోధనలో 'నీ కొడుకు సంగతి ఏమిటి?' అని అనటంలో మనం ముఖ్యంగా గమనించ వలసినది మమకారాన్ని వదిలివేసినట్లుగా అర్థం అవుతోంది. కుమార్తెలు ముగ్గురు ఆమె చెంతనే ఉన్నారు. ఆవిడ ఆరోగ్యం రోజురోజుకు క్షీణించడం మొదలైంది.

శ్రీమాతాజీవారు రాజకుమారితో చాలాసేపు ముచ్చటించారు. చివరకు మాతాజీ వెళ్ళిపోతూ నేను భౌతికంగా దూరంగా ఉన్నా, మానసికంగా నీతోనే ఉంటాను సుమా! మీరు ధైర్యంగా ఉండండి. గురుదేవులు మన చెంతనే ఉన్నారు అని అభయమిచ్చారు. పరిస్థితి విషమించడం వలన రాజకుమారిగారిని ఆంధ్రాహాస్పటల్‌లో చేర్చాము. ఎప్పుడు హాస్పటల్‌లో చేరినా మాతాజీ ఆశీస్సులు అందుకోకుండా బయలుదేరలేదు. ఈ పర్యాయము మాతాజీ ఊరిలో లేని కారణంగా అది సాధ్యపడలేదని రాజకుమారి కలతచెందింది. శ్రీమాతాజీ అనుకోకుండా అకస్మాత్తుగా అమెరికా వెళ్ళినట్లు తెలిసింది. అయినా రాజకుమారి ఆరోగ్యాన్ని గురించి ఎప్పటికప్పుడు తెలుసుకుంటూనే ఉన్నారు. ఆరోగ్యం క్షీణించిందని తెలిసిన వెంటనే శ్రీమాతాజీ అమెరికాలో ఉన్న మా అబ్బాయి శ్రీనివాస్‌కి ఫోన్‌చేసి, ఇండియా వెళ్ళటానికి టికెట్ బుక్ చేసుకో అని హెచ్చరించారు. అదేరోజు మేము కూడా శ్రీనివాస్‌ని వెంటనే బయలు దేరమని ఫోన్ చేశాము.

ఆంధ్రా హాస్పిటల్‌లో ఉండగా అంతిమ క్షణాలలో చాలమంది వచ్చి ఆమెను చూసి వెళ్ళారు. ఆవిడ మా అల్లుడితో మాట్లాడుతూ 'ఇంక నాకు ఎవ్వరినీ చూడాలనిగాని, ఎవ్వరితో మాట్లాడాలనిగాని లేదు. నా దేహానికి అమర్చిన పరికరాలను తీసే ఏర్పాటు చేసి, నాకు ఈ బంధాల నుండి విముక్తి కలిగించండి' అన్నది. ఆవిడతో మాట్లాడటానికి వచ్చిన డాక్టరు 'భయపడకండి బాబు నామస్మరణ చేసికోండి' అని హెచ్చరించినప్పుడు సమాధానం చెబుతూ 'నాకు భయం ఎందుకు? గత తొమ్మిది నెలల నుంచి నన్ను నడిపించుకుంటూ వచ్చింది ఆయనే కదా!' అన్నది.

నాకు ఎవరితోనూ మాట్లాడాలని లేదు నన్ను డిస్టర్బ్ చేయకండి అని హెచ్చరించినా ఆవిడను కలవడానికి వెళ్ళిన స్కూలు టీచర్లను, ఇతరులను అందరినీ పలకరించి మాట్లాడింది. కానీ నేను ఆవిడను చూడటానికి ఎప్పుడు వెళ్ళినా తానెంతో దేహబాధను అనుభవిస్తూ ఉండటం వలన నేను ఆబాధను చూడలేక వెంటనే వచ్చేసేవాడిని. నేను వచ్చిన వెంటనే వెళ్ళిన స్కూల్ టీచర్ చేయిపట్టుకొని ఆప్యాయంగా పలకరించి మాట్లాడేది.

-సశేషం

## ముంబయిలో శ్రీ మాతాజీ వారి సత్సంగములు- నివేదిక

శ్రీ అయ్యప్పస్వామి సచ్చిదానంద భక్త సమాజంవారు శ్రీఅయ్యప్పస్వామి ఏకాదశ వార్షిక మహాపూజ సందర్భంగా ఏర్పాటు చేసిన కార్యక్రమములలోశ్రీ మార్కండేయ దేవస్థానం, వర్లిలోశ్రీమాతాజీవారు ది.29.12.08 సాయంత్రం 6గం.30ని.లకు ప్రణవ పతాక ఆవిష్కరణ చేశారు. ఆతరువాత వారుశ్రీబాబు భక్త సమాజం వారి సహాయ సహకారాలతో నిర్వహించిన సాధుసమ్మేళన సభలలో ది.01.01.09 వరకు ప్రతిరోజు సాయంత్రం 7గం.30ని.లనుండి 9 గం. వరకు అనుగ్రహభాషణం చేశారు.



ఈ సమావేశాలలో ముందుగా7గం.నుండి 7గం.30ని.ల వరకు శ్రీ సచ్చిదానందస్వాములవారు తమ దివ్య సందేశాన్ని అందించారు. ఈసత్సంగ సమావేశాలకు భక్తులు అసంఖ్యాకంగా హాజరైనారు. జనవరి 1వతేదీ సాయంత్రం 6గం.30ని.లకు శ్రీ మాతాజీ మార్కండేయ మందిరంలో సామూహిక కుంకుమపూజలు నిర్వహించారు. ఈ పూజలలో శ్రీఅయ్యప్పస్వామి సచ్చిదానంద భక్త సమాజం వారు భక్తులకు పూజా సామాగ్రిని ఉచితంగా అందజేశారు. జనవరి 2వతేదీ శ్రీఅయ్యప్పస్వామి,శ్రీ సాయిబాబామూర్తులను, శ్రీమాతాజీవారిని, శ్రీసచ్చినందస్వామివారితోపాటు ఇతర సాధుమహాత్ములను పల్లకీలలో 'వర్లినాకా'లో ఎంతో వైభవంగా ఊరేగించారు. నవంబరు 26న జరిగిన టెర్రరిస్టుల దాడుల నేపథ్యంలో నగరంలో అంతటా గట్టి భద్రత ఏర్పాట్లు ఉన్నా ఈ ఊరేగింపు జనసందోహంతో నిండిన ముంబయి 'వర్లినాకా'లోని ముఖ్యవీధులలో ఘనంగా జరగటం విశేషం. అనేకమంది భక్తులు నగరవీధులలో నిలబడి, భవనాలపైనుండి శ్రీమాతాజీవారిని, సాధు మహాత్ములను దర్శించుకున్నారు. శ్రీఅయ్యప్పస్వామి సచ్చిదానంద భక్త సమాజం వారు జనవరి 4వతేదీ ఆదివారం నాడు శ్రీఅయ్యప్పస్వామి మహాపూజ, వేలాది భక్తులకు మహాప్రసాదవితరణ ఎంతో ఘనంగా చేశారు. *

# జ్ఞాన పుష్కరిణి

- సుషుమ్న ప్రసాద

మానవుని మనుగడకు ఆధారభూతమైనవి జీవనదులు. భూమిని సస్యశ్యామలం చేసి, పుష్కలమైన పాడిపంటలు ఇచ్చి, మానవుని ఆకలి, దప్పులు తీర్చేవి జీవనదులు. మహాత్ములు కూడా జీవనదుల లాంటివారే. జ్ఞానభిక్షతో, పవిత్రతీర్థముతో ఆధ్యాత్మికమైన ఆకలిదప్పులు తీర్చి, నిత్యతృప్తి నిచ్చేవారు మహనీయులు. జ్ఞానతరంగిణి నిరంతరమూ ప్రవహిస్తూనే ఉంటుంది. అలాంటి జ్ఞానుల కోవకు చెందినవారే పూజ్యశ్రీ లలితానంద సరస్వతిస్వామిని. ఆమె భౌతికంగా మనందరికీ దూరమై, ఒక పుష్కరము గడిచింది.

12సంవత్సరాల కొకసారి గంగ, గోదావరి, కృష్ణవేణి, కావేరి, తుంగభద్ర మున్నగు పవిత్ర నదులకు పుష్కరాలు వస్తాయి. పుష్కరాల సమయంలో ఆ పవిత్ర తీర్థములో స్నానమాడితే పునీతులమవుతామని మన భారతీయుల సంపూర్ణ విశ్వాసము. అందుచేతనే ప్రజలు తండోపతండాలుగా వెళ్ళి పుష్కరస్నానాలు చేస్తారు. జీవనదులకు 12 రోజులు మాత్రమే పవిత్ర దినములుగా భావిస్తాము. కాని జ్ఞాన పుష్కరిణి కాలముతో నిమిత్తము లేకుండా నిరంతరము పవిత్రతను ప్రసాదిస్తుంది.

పూజ్య లలితానంద సరస్వతీ స్వామిని భౌతికంగా మనకందరికీ కనుమరుగై ద్వాదశ సుదీర్ఘ వర్షాలు గడిచిపోయినా ఆమె చేసిన దివ్య ప్రబోధము, యిచ్చిన ఆధ్యాత్మిక స్ఫూర్తి ఆశ్రమవాసులకు, ఆత్మీయులందరికి నిత్య నూతనంగా ప్రకాశిస్తున్నదనటంలో అతిశయోక్తి లేదు. ఆమె జీవిత పుటలు తెరిచి చూస్తే, వ్యావహారికంగా, అదొక విషాద నిలయం. ఆధ్యాత్మికంగా ఆనంద నిలయం. కీ.శే. పావులూరి వెంకటసుబ్బారావు, కీ.శే. రుక్మిణమ్మగార్ల జ్యేష్ఠ పుత్రికగా ఉద్భవించిన తల్లికి జననీ జనకులు పెట్టిన నామధేయము హనుమ జయప్రద. ఆధ్యాత్మికంగా పరిపూర్ణురాలుగా గురుమూర్తి నిర్ణయించి, ఆమె కిచ్చిన నామధేయము లలితానంద సరస్వతి. రెండూ ఆమెకు సార్థక నామధేయములే. చిన్నప్పటి నుండీ తండ్రి అడుగుజాడలలో హనుమదుపాసన చేసి, హనుమంతుని భక్తి విశ్వాసములను, తీవ్రమైన పట్టుదలను సాధనతో అలవరచుకొన్నది. భక్తి విశ్వాసములతో, తీవ్రమైన పట్టుదలతో తలపెట్టిన కార్యాన్ని జయప్రదం చేసేది. అందుచేతనే 'హనుమ జయప్రద' అనేది ఆమెకు సార్థక నామధేయము.

పువ్వు పుట్టగానే పరిమళం వస్తుంది అన్నట్లుగా ఆమె బాల్యము నుండి బహుమేధావి. కడు కుశాగ్రబుద్ధితో ఏకసంతగ్రాహిగా జ్ఞాన సముపార్జన చేసింది. బాల్యములో ఆమెకు సంస్కృతభాష నేర్పించారు. రామాయణ మహాభారతేతిహాసాలు, రఘువంశము, అభిజ్ఞాన శాకుంతలము మున్నగు కావ్యములను, భాగవతము, భగవద్గీత, ఉపనిషత్తులను, సాంగోపాంగంగా పఠించి చక్కగా అవగాహన చేసికొని, స్వయం కృషితో అద్భుతమైన పాండిత్యమును సాధించిన మేధావి. లాలిత్యము,

మార్దవము ఆమె సహజ లక్షణాలు. ఆనంద స్వరూపిణియై, మూర్తీభవించిన సరస్వతిగా వెలుగొందిన ఆ అమృతమూర్తికి 'లలితానంద సరస్వతి' సార్థక నామధేయము.

పదిహేను సంవత్సరాలు మాత్రమే ప్రాపంచిక పరంగా ఆమె జీవితంలో వెలుగు, సౌభాగ్యములు. పదహారేళ్ళ పసిడిప్రాయంలో ఒక బిడ్డకు తల్లియై, జీవిత భాగస్వామిని కోల్పోయి. ఆమె జీవితంలో విషాదమనే కారుమేఘాలు దట్టంగా అలుముకొన్నాయి. అర్జుననకు విషాదయోగమే, జ్ఞాన, విజ్ఞాన యోగములకు నాంది అయినట్లుగా, లలితానంద సర్వస్వతి స్వామిని జీవితంలో విషాదమే కారుమేఘాలను చీల్చుకొని. జ్ఞానజ్యోతి ప్రభవించింది. జీవితంలో సుఖదుఃఖాలనేవి రేయింబవళ్ళ వంటివని, వాటికి విలక్షణమై, అతీతమైన నిత్యానందాన్ని పొందటమే జీవిత పరమావధియని, మా పెత్తల్లి నుంచి కలపాటి లక్ష్మి నరసమాంబగారు ఆమెకు చేయూతనిచ్చి. విషాదయోగానికి వీడ్కోలు చెప్పి, ఆధ్యాత్మిక జీవితానికి శ్రీకారం చుట్టించింది.

If winter comes, can Spring be far behind అని ఆంగ్ల మహాకవి షెల్లీ చెప్పినట్లుగా 'గడగడ వణికించే శీతాకాలం తరువాత, వసంతం రాకుండా ఉంటుందా?' అని అర్థం. అలాగే విషాదమనే హేమంత ఋతువుతో మోడువారిన జీవిత వృక్షం జ్ఞానమనే వసంతంతో చిగురించింది. అలంకరణకు, ఆభరణాలకు దూరమైన ఆ తల్లి, భక్తియనే అలంకరణ, వైరాగ్యమనే ఆభరణముల వర్చస్సుతో వెలుగొందేది. నుదుట తిలకానికి బదులు విభూతిరేఖలతో వైభవాన్ని సంతరించు కున్నది. సేవా దృక్పథమవేది కర్ణునికి కవచకుండలా ల్లాగా ఆమెకు సహజమైన ఆభరణము. సోమరితనాన్ని ప్రబల శత్రువుగా భావించేది. ఎవరికి సేవ చేసినా భగవత్సేవగా భావించేది.

ఎవరు ఆపదల్లో ఉన్నా, కష్టాల్లో ఉన్నా ఓదార్పునిచ్చి, చేయూత నివ్వటమే ఆమె ధ్యేయంగా భావించేది. మా చిన్నక్క ప్రసవించి బాబు పుట్టాడు. వెంటనే ఆమెకు తీవ్రమైన టైఫాయిడ్ జ్వరం వస్తే, ఆ బిడ్డ ఆలనా, పాలనా యావత్తు పెద్దక్కే చూసేవారు. ఆమె పసిబిడ్డకు నమకంచమకం చదువుతూ స్నానం చేయించేది. ఉపనిషత్తులు చదువుతూ ఊయలులూపేది. భగవద్గీత, భాగవతంలోని పద్యాలు చదువుతూ పాలు పట్టించేది. అప్పుడు చిన్నపిల్లల మయిన  నేను, హేమ చాలా శ్రద్ధగా గమనిస్తూ పసిబిడ్డలకు శ్లోకాలు చదువుతూ స్నానం చేయించాలనుకొనేవాళ్ళం. ఇప్పుడాలోచిస్తే ఆమె పసిబిడ్డకు స్నానం చేయిస్తూ రుద్రాభిషేకం చేస్తున్నట్లుగా భావించేది. అంటే బాహ్యంగా ఏ పని చేస్తున్నా, భగవత్సేవగా భావించేది. నాకు ఊహతెలిసినప్పటినుండి పెద్దక్క శ్రోతలు కనబడగానే అమితోత్సాహంతో ఆధ్యాత్మిక ప్రబోధ వినిపించేవారు. నిరంతరము సద్గోష్ఠి, సద్విచారణతో కాలాన్ని సద్వినియోగం చేసికొనేది. ఆలా గురు సాంగత్యముతో విషాదానికి వీడ్కోలు చెప్పి, ఆత్మవిచారణతో ఆనందాన్ని పొందుతూ, అందరికీ పంచిపెట్టేది. -సశేషం

# శ్రీరాముని పాదతీర్థం!

శ్రీరామచంద్రుడు తన తండ్రి, తల్లికిచ్చిన వరాన్ని సఫలపరచటానికి సింహాసనాన్ని త్యజించి సీతాలక్ష్మణ సమేతుడై అరణ్యాలకు బయలుదేరాడు. మధ్యలో నది దాటవలసి వచ్చింది. నావికుడు గుహుడు శ్రీరామచంద్రుణ్ణి అవతలి ఒడ్డుకు చేర్చటానికి కొన్ని అభ్యంతరాలు చెప్పాడు. అది విని లక్ష్మణుడికి ఆగ్రహ కారణమైంది. 'నా అన్నగారిని పడవ ఎక్కించటానికి అభ్యంతరమా?' అంటూ అదిరిపడ్డాడు.

శ్రీరామచంద్రుడు చిరునవ్వుల వెన్నెలలు కురిపిస్తూ 'వత్సా! ఆవేశపడకు. కారణం అడిగి తెలుసుకుందాం' అంటూ లక్ష్మణుణ్ణి సముదాయించాడు. గుహుడు రోషంతో 'అవునండీ! ఒక భార్యా, పిల్లల్ని బ్రతికించుకో లేక సతమతమవుతున్నాను. ఈ పడవ కూడా ఆడదైతే ఇక నా పాట్లు చెప్పండి' అన్నాడు. 'పడవ ఆడది ఎట్లా అవుతుంది?' అని లక్ష్మణుడు గదమాయించాడు. శ్రీరాముడు సీతవంక చిలిపిగా చూస్తూ 'ఏమిటి లక్ష్మణా! అంత తొందర. అంతా అతనే చెబుతాడు విందాం'.

గుహుడు తన భయ కారాణాన్ని, శ్రీరామచంద్రుని నిజస్వరూపాన్ని చక్కగా వివరించి చెప్పనే చెప్పాడు. సీతాదేవి ఆనందబాష్పాలు రాల్చింది. లక్ష్మణుడు సిగ్గుతో తలవంచుకున్నాడు. 'శ్రీరాముని రహస్యం వా ఒక్కడికే తెలుసు. అందుకనే ఈయన్ని పడవ ఎక్కించుకోవటానికి భయపడుతున్నాను. ఈయన పాదధూళి సోకి రాయి స్త్రీగా మారింది. రాయే స్త్రీగా మారినప్పుడు నా పడవ స్త్రీగా మారదా? సందేహం లేదు. తప్పక మారుతుంది. అందుచేత ఈయన పాదాలు పూర్తిగా కడిగిన తరువాతనే పడవ ఎక్కనిస్తాను' అన్నాడు.

గుహుడు శ్రీరామచంద్రుడి పాదపద్మాలను అత్యంత ప్రేమతో కడిగి ఆ తీర్థాన్ని నెత్తిమీద జల్లుకుంటున్నాడు. ఆశ్చర్యం! ఆకాశం నుండి దేవతల స్వరాలు వినబడుతున్నాయి. 'ఓ గుహుడా! వేడుకుంటున్నాము. ఆ పవిత్ర తీర్థాన్ని మా శిరస్సులపై పడేట్లు ఎత్తుగా ఎగురవేయి. మేము పునీతుల మవుతాము. అవును ఎప్పుడో యుగానికి ఒక్కసారిగాని నిర్గుణ పరమాత్మ సగుణాకారం ధరించి భూమిమీద అవతరించడు. ఆ నిర్గుణ సగుణ సమ్యక్ సమ్మేళనమే శ్రీరామచంద్ర మూర్తి. ఆయన పాదాలు కడిగిన జలం శిరస్సున ధరించటం భాగ్యానికే భాగ్యం! ఈ సుమూహర్తం కోసం ఎప్పటి నుండో నిరీక్షిస్తున్నాము. ఓ గుహుడా! ఆ తీర్థాన్ని మా శిరస్సులపై పడేటట్లు ఎగరవేయి. వేడుకుంటున్నాము' అని వినబడింది.

లక్ష్మణుడు గుహుడు ఒక్కసారి సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోయారు. ఆ దేవతల స్వరాలలో ఒక స్వరం అన్నిటిని మించి దిశలు ప్రతిధ్వనించింది.

'ఓ గుహుడా! మరింత ఎత్తుగా ఆకాశాన్ని దాటేటట్లు ఎగురవేయి, వేడుకుంటున్నాను' అని. ఇది పరమేశ్వరుని కంఠస్వరంగా శ్రీసీతారాములు గుర్తించగలిగారు. శ్రీరాముని పెదవులపై పరంజ్యోతి నాట్యమాడింది. *

# ఆశ్రిత వత్సలుడు

-సుశీలా ప్రసాద

(గతసంచిక తరువాయి)

ఇక రాత్రంతా సరిగా నిద్రపట్టలేదు సుదామునికి. అక్రూరుని కథనంతా చెవులారా విన్నాక, హరిరూపం కనులలో నిలచిపోయాక, మనస్సులో ఆశలు మెరుపులవలె తళుక్కుమంటుంటే వానికి నిద్ర ఎలా వస్తుంది? క్షణక్షణం తలెత్తి ఆకాశం వంక చూస్తూ నక్షత్ర గమనాన్ని బట్టి కాలాన్ని గుణిస్తూనే ఉన్నాడు వేగుపొడిచినదాకా. కాలం గడవటం దుర్భరం అయింది. ఎలాగో వేకువజాము అయింది. దిగ్గున పడక మీద నుంచి లేచి పూలతోట లోనికి రివ్వున పరుగుతీశాడు. తనకు జీవనాధారమైన ఆ తోట తన చేతులతోనే పెంచుకునే ముద్దుల మూట. వన్నె వన్నెల కుసుమాలెన్నో తోటలోకి అడుగు పెట్టిన వానినాహ్వానిస్తూ కనువిందుచేశాయి. విరిసీ విరియని వాటిని స్పృశిస్తూ అమితానందాన్ని అనుభవిస్తూ పిమ్మట కాలకృత్యాలకి కాలుకదిపాడతడు.

తెల్లవారింది. మధురానగరం మేల్కొంది. పురవీధులలో క్రమంగా జన సంచారం అధికమైంది. అతడు తోటలోకి వెళ్ళి పూలన్నీ కోశాడు. ఈరోజు ఎప్పటివలె కాక మరిన్ని పూలు పూసినట్లు, మరింత రంగులతో అలరారుతూ కలకల నవ్వుతున్నట్లు అనిపించింది. తన దినచర్య ప్రకారమే మాలలు అల్లడానికి వాటిముందు కూర్చున్నాడు. ఆ పూలన్నీ ఎంతో తమకంతో ఎప్పుడెప్పుడా అని తనను ప్రశ్నిస్తున్నట్లు అనిపించి, ఏదో సమాధానం చెప్తూ, తన మనస్సులో ఏదో మాట్లాడుకుంటూ, తదేకాగ్రచిత్తుడై మాలా రచనలో మునిగిపోయాడు.

అలాంటి సమయంలో ఎవరెవరో తాను అల్లే పూలమాలల కోసం రోజూకిమల్లె అతనింటికి వచ్చారు. అప్పుడతను ఒక క్షణ మాత్రం తలెత్తి 'అయ్యా! దయచేసి ఈరోజు మాత్రం ఈ మాలలు అడగకండి' అని వినయంగా పలుకుతూ తిరిగి తన పనిలో నిమగ్నమైపోయాడు. కొద్దిసేపు అయ్యాక అంతః పుర పరిచారకులెవరెవరో వచ్చారు. వారికీ అతని నుంచి అదే సమాధానం వచ్చింది. అయితే వారు ఇతరుల వలె వెనుదిరిగి పోక అతన్ని గద్దించి అడిగారు 'ఏమయ్యా! మేము నీ వద్ద నుంచి రోజూ తీసికొనిపోయే మాలలు కంస మహారాజుకు, వారి రాణీవాసానికి అని నీకు తెలియదా? ఇలా మాట్లాడుతున్నావు' అని. అతడు రవ్వంతైనా చలించకుండా తన పని చేసుకుంటూ 'ఏది ఏమైనా ఈరోజు మాత్రం నన్ను వదిలేయండి' అని మెల్లిగా బదులు చెప్పాడు. చేసేది లేక వాళ్ళు వట్టి చేతులతోనే తిరిగి పోతుంటే తనలో తనే గొణుక్కుంటూ వినాశకాలం దాపురించిన కంసునికింకా హారాలెందుకు? అలంకారాలెందుకు? కంస

పరివారాన్ని పరిమార్చిన పురుషోత్తముడు అక్రూరుని వెంట రానేవచ్చాడు. అతని చేతిలో తగిన కానుక కంసునికి అందటానికి ఎంతో వ్యవధిలేదు అనుకోసాగాడు.

అతని పనంతా పూర్తి అయ్యేసరికి మధ్యాహ్నమైంది. తన ఎదుట సిద్ధమైన అతి మనోహరమైన పుష్పహారాలను చూస్తూ అతడు పొంగిపోతూ అంతవరకూ తను పడిన శ్రమనంతా మరచిపోయాడు. కన్నార్పకుండా వాటినే చూస్తూ తన ఈ తపస్సుకి ఫలం లభిస్తుందా? తను కన్న కల ఫలిస్తుందా? తానెదురు చూసే క్షణం!! ఆశ్చర్యంగా ఆ క్షణమందే అతని మనస్సులోని ప్రశ్నలన్నిటికీ సమాధానమన్నట్లుగా తెరచి ఉన్న వాకిలి లోనుంచి లోపలికి ప్రవేశించారు రామకృష్ణులు. కన్నుల ముందు మెరుపు మెరిసినట్లయింది. దిగ్భ్రాంతుడైనాడు. అంతలో చటుక్కున లేచి నిలబడ్డాడు. త్వరత్వరగా ముందుకు నడిచి సంభ్రమంతో వారికి స్వాగతం పలికాడు. తనకున్నంతలో వారికి అర్ఘ్యపాద్యాదులు ఇచ్చి, ఆసనాలు ఏర్పరిచాడు. అనుచరులతో సహా వచ్చిన వారికి అర్ఘ్యపాద్యాదులిచ్చి ఆసనాలు ఏర్పరిచాడు. అనుచరులతో సహా వచ్చినవారికి గంధ తాంబూలాదులు సమర్పించాడు.

ముద్దులొలికే ఆ చిన్ని బాలురిద్దరూ అత్యంత మనోహరంగా అలంకరించుకుని ఉన్నారు. 'అన్నా! లోకసంరక్షణార్థం అవతరించిన మీరిద్దరూ రావటంతో నా ఇల్లు పావనమైంది. నా తపస్సు పండింది. నా కల ఫలించింది. మీ దాసుడిని ఏం చేయమంటారో ఆజ్ఞాపించండి' అంటూ కన్నుల నిండా ఆనందబాష్పాలు పొంగిరాగా గద్గద స్వరంతో పలుకుతూ, తానంత వరకూ అల్లిన పూలదండలను దోసిటిలో పట్టి వారికి సమర్పించాడు. రామకృష్ణులు ఇద్దరూ అతడిచ్చిన సుమహారాలను చక్కగా ధరించారు. కాంతులు వెదజల్లే నవ్వు ముఖాలతో అతనిని చూస్తూ నీకేం వరం కావాలో కోరుకో!' అన్నారు.

**'నీ పాద కమలసేవయు, నీ పాదార్చకులతోడి నెయ్యమును, నితాంతాపార భూతదయయును, తాపసమందార నాకు దయసేయగదే!'** చేతులు జోడించి తలవంచి వినయంగా వేడుకుంటున్న సుదాముని చూసి బలరామకృష్ణులిద్దరికీ వాని కోరిక వినగా పరమానందమైంది. 'తథాస్తు' అంటూ అలాగే ఇచ్చి మాధవుడా మాలికునికి ఇతోధికంగా బలాయుఃకీర్తి కాంతి సంపదలను కూడా ప్రసాదించాడు.

'విశ్వనిధాన మూర్తులై భూవలయాన్ని కావగా పుట్టిన వారురావటంతో తన ఇల్లు పావనమై తపం పండి, గృహలక్ష్మిచే సేవితమై ఇష్టాలు చేకూరినవని మురిసిపోయిన సుదాముని జన్మ సార్థకమైనది. *

# మాతాజీ బోధామృతం

(గత సంచిక తరువాయి) - శివ ప్రసాద్

ఎంతసేపటికీ నేను ఒక తల్లిదండ్రులకు పుట్టాను, ఈ క్వాలిఫికేషన్స్ ఉన్నై, ఈ భాషలు మాట్లాడగలను, ఇంత ఆస్తి సంపదలకు నేను వారసుణ్ణి, ఇటువంటి వాటన్నిటిలో బాగా మునిగిపోయి, ఆ మహాత్ములకు కూడా మనం వాటిని పూస్తామన్నమాట. చిన్నప్పుడు ఎక్కడ ఉండేవారు? ఎంత వయస్సు ఉంటుంది? అని. మనం ఎంత కాదనుకున్నాసరే, మధ్యమధ్యలో సంభాషణను ఏదో ఒక రకంగా మళ్ళీ అటువైపే తీసికెళ్తారు.

ఒకసారి ట్రెయిన్‌లో పాపం ఒకాయన ఆసక్తికరంగా ఏవో తత్త్వ విషయాలు అడుగుతున్నారు. నేను సమాధానాలు చెప్తున్నాను. కాని ఈ మనస్సు వాసన ఉన్నదే, దానికి మాత్రం ఎప్పుడూఆ ప్రక్కన ఏమున్నదో తెలిసికోవాలి అని ఉంటుంది. హాయిగా నీకు అవసరమైనదేదో నీవు తెలిసికోవచ్చుగా. మధ్యలో ఆ మహాత్ముల జీవితం మనకెందుకు? మన జీవితం పునీతం చేయటం కోసం ఆ మహాత్ములు అవతరించారు. వారి జీవిత వివరాలు మనకెందుకు? వారి అవతారమే మనకు మహా ప్రసాదం. అది చాలు మనకు. నేను ఆయనకు అదే చెప్పాను. నా తల్లి తండ్రులు ఆ మహాత్ముని వద్దకు నన్ను చేర్చారు. చేర్చిన తరువాత నాకు అటువంటి వివరాలతో అవసరం లేకపోయింది. అయినా ఇందాకటి నుంచి చూస్తున్నాను. పాటలో పల్లవి మాటిమాటికీ రిపీట్ అయినట్లు మీరు దాన్నే పట్టుకొని మాటిమాటికీ వారి జీవితం గురించే అడుగుతున్నారు. వారిని ఆశ్రయించిన తరువాత వారు నాకు లోకాతీతమైన అనుభూతిని ప్రసాదించారు. ఈ లోకంలో ఉన్న తీరును గురించి నేను వారిని అడగవలసిన అవసరం రాలేదు. కాబట్టి మీరు అడిగేది నాకు తెలియదు. అందువలన మీకు చెప్పలేక పోతున్నాను అన్నాను. పాపం! అప్పుడు ఆపాడు.

మీరు లోకానికి అలవాటుపడి ఉన్నారు. చేతిని ఒక్కసారి మామూలుగా కడిగితే అప్పుడే తిన్న ఆవకాయ అన్నం వాసన కూడా పోదు. నాలుగుసార్లు కడగాల్సివస్తుంది. మరి జన్మజన్మల నుండి వాసనా పరంపరలతో వస్తున్న మనస్సులోని వాసనలు ఒక్కసారి కడిగితే పోతాయా భగవన్నామంతో

రాపిడి చెందకుండా? ఇందుపగింజ అని ఉంటుంది. అది నీళ్ళలో వేస్తే నీళ్ళు తేరుకుంటాయి. బిందెలో నీళ్ళు పట్టి దానిని బిందెలో వేస్తే, అది అరిగిపోయి క్రమంగా కరుగుతుంది. బురద క్రిందకు పోయి తేట నీరు పైకి తేరుకుంటుంది. ఇందుపగింజ అరగకుండా బురద నీటిని మంచినీరుగా చెయ్యటంలా. అలాగే మన మనస్సును కూడా భగవన్నామంతో రాపిడి పెట్టాలి. భగవత్తత్త్వం జుర్రుకోవటంలో మనస్సును మరచిపోవాలి. అప్పుడు సమాధానం దొరుకుతుంది. అలా కాకుండా అన్నీ చూడాలి, అన్నీ చేయాలి, అన్నిట్లో మునిగి ఉండాలి. అయ్యో! దీనిని ఎలా వదిలి పెడ్తామండీ! అయ్యో! దీనిని వదిలిపెడితే ఎలా అని ఇంటినీ, అటు పుట్టింట్లోవారినీ, తత్తిమ్మా వాళ్ళనూ అందరినీ పట్టుకుంటే అవి ఊరుకుంటాయా?

ఇద్దరు ఒక కాలవగట్టు మీద వెళ్తున్నారు. అలా వెళ్తుంటే వాళ్ళకు కాలవలో ఒక నల్లటి మూట తేలుతూ కొట్టుకొని పోవటం కనిపించింది. వాళ్ళలో ఒకడు రెండవ వాడితో ఒరేయ్! ఏదో నల్లని మూటరా. బట్టలో ఏమిటో....... అంటుండగానే రెండవాడు నీళ్ళలోకి దూకేశాడు, ఆ చెప్పిన మొదటివాడు తనకంటె ముందుగా ఎక్కడ దూకుతాడో అని. బట్టల మూట అనేసరికి పాపం ఆశ అన్నమాట. వాడు ఈదుకుంటూ వెళ్ళి ఆ బట్టల మూటను పట్టుకున్నాడు. పట్టుకున్నవాడు వెనక్కిరాడే ఎంతసేపటికీ. వాడు ఎంతసేపటికీ ఒడ్డుకు రాకపోతుంటే ఒడ్డున ఉన్నవాడు 'ఒరేయ్! వెనక్కు రారా. ఎంతసేపు దాన్నే పట్టుకు కూర్చుంటావు? త్వరగా ఒడ్డుకురా' అని కేకవేశాడు. రెండవవాడు 'ఏం రానురా! నేను పట్టుకుందామని వస్తే, అదే నన్ను పట్టుకున్నది' అన్నాడు. అది ఎలుగుబంటి. నీళ్ళలో కొట్టుకొని పోతూ, ఏ ఆధారం దొరుకుతుందా అని కొట్టుకుంటోంది. వీడు వెళ్ళి దాని బారిన పడ్డాడు. అది వీణ్ణి పట్టుకున్నది.

మనం దేన్నో పట్టుకుందామని ప్రపంచంలోకి వెళ్తే ప్రపంచం మనను పట్టుకుందా? మనం ప్రపంచాన్ని పట్టుకున్నామా? ఆశ అన్నమాట. ఆశతో ప్రపంచంలోకి వెళ్తే, పట్టుకుంటే పట్టుకుంటాయి, అనుకుంటే అంటుకుంటాయి. ఒకామె ఎవరో సుఖంగా ఉంటుందని ఒక కుర్చీ తెచ్చుకోవాలని వెళ్ళి సేల్‌లో కదా అని చౌక అని ఇంకొక రెండు కుర్చీలు కూడా కొన్నది. అదేమంటే అదేదో సేల్. సేల్‌లో అయితే చౌక, ఆ సేల్‌లో కొనేద్దాము అని ఇల్లంతా పేర్చేసుకుంటాము అది లేదని, ఇది లేదని. ఇది ఇప్పటిదికాదు. ఎప్పటి నుంచో మనస్సులో చాలా పెంచుకుంటాము ఇట్లాంటివి. అది చాలా బరువు

అవుతున్నది. అందువల్ల ఏం కావాలి? మనస్సు లేకుండా చేసుకోవాలి. దానికి ముందు అది మనకు ఇష్టం కావాలి. మనం దానికి చేసే సాధన యందు ఇష్టం ఉండాలి. ఏమైనా సరే తప్పక హాయి ఉంది అక్కడ. అది మన గురుదేవులు చెప్పారు. మన గురుదేవులు మన కన్న తండ్రి. కన్న తల్లితండ్రులు చెయ్యలేని పని గురుదేవులు చేస్తున్నారు మన గురుదేవుల అనుగ్రహం పరిపూర్ణ మైనది. వారు కనుమరుగయ్యారే తప్ప, మనని వదిలిపెట్టి ఎక్కడకీ వెళ్ళలేదు. గురుదేవులు అక్కడ ఉన్నారు, లేదా వారింటికి వెళ్ళారు, వీళ్ళింటికి వెళ్ళారు. వాళ్ళకారు ఎక్కారు, నా కారు ఎక్కలేదు ఇలాంటివన్నీ మాట్లాడుకుంటున్నామని కాస్త కనుమరుగయ్యారు, అన్ని కార్లలో ఉన్నాను అని అనిపించుకోవటానికి.

ఎక్కడ కనుమరుగయ్యారు? మన హృదయంలోనే. నీ హృదయబాబు అని ముద్ర వేశారు. ఈ మనస్సు ద్వారా సృష్టించేది మనో సృష్టి. కాని నిన్ను ఎవరు సృష్టించారు? భగవంతుడు. సర్వసృష్టి భగవంతుడు చేశాడు. భగవంతుడు సృష్టించిన తరువాత, మళ్ళీ మనం మనస్సుతో సృష్టించి కష్టసుఖాలు అనుభవిస్తున్నాము కదా! అది ఎవరి సృష్టి? మనోసృష్టి. మనో సృష్టి బాధలను తెచ్చిపెడుతుంది. దైవసృష్టిని గుర్తించి మనస్సు ఎప్పుడైతే లయిస్తుందో, అప్పుడు మనకు బాధ ఎక్కడ ఉన్నది? ఎంత హాయిని పొందుతున్నాము? నిద్రపోవాలి అనుకున్న వ్యక్తికి నిద్రపట్టిందనుకోండి, ఎంత హాయిగా ఉంటుంది? నిద్రపట్టకపోతే! మీకేం తెలుస్తుంది? నన్నడగండి, నిద్రకోసం ఏ తపస్సు, ఏ ఉపాసన చేయాలి అనేది. నేనైతే ఏమీ చెయ్యనక్కర్లా. నాకేమన్నా కష్టం ఉంటేగా నిద్రపోకపోతే కూడా అంతా సుఖమే!

-సశేషం

**జనవరి నెలలో సత్సంగ సమావేశములు**

జనవరి 20 నుండి 22వరకు గోకుల్ మత్తికేరి,బెంగుళూరులో శ్రీమాతాజీవారి సత్సంగములు వైభవంగా జరిగినవి.
జనవరి 23 నుండి 26వరకు శ్రీకాళీవనాశ్రమము, భాగ్యనగరశాఖలో శ్రీమాతాజీవారి సత్సంగములు వైభవంగా జరిగినవి.

# మాతాజీ సత్సంగ్ డైరీ

-రమణ ప్రసాద్

(డిసెంబరు 9నుండి 11 వరకు గుండుగొలను గ్రామంలో శ్రీశ్రీశ్రీ గీతా యజ్ఞము, సాధుధర్మ సమ్మేళనం జరిగాయి. ఆ తరువాత సత్సంగ కార్యక్రమాలు 15వతేదీ వరకు జరిగాయి. ది.13న బ్రాహ్మీ ముహూర్తంలో శ్రీ మాతాజీ వారు చేసిన **ప్రబోధం** సంగ్రహంగా ఇక్కడ ప్రచురిస్తున్నాము - ఎడిటర్)

**శ్రీసమంచితమవ్యయం పరమ ప్రకాశమగోచరం**
**భేద వర్జితమప్రమేయ మనంతమాద్యమకల్మషం**
**నిర్మలం నిగమాంతరస్థిత మాదికారణమచ్యుతం**
**ప్రాతరేవహిమానసాంతర్భావయే ద్గురు పాదుకాం**

ప్రాతఃకాల సమయాన మనస్సులో అంతర్భావయేత్- ఏభావనచేస్తున్నామో పగలు పెరిగినకొలదీ మనస్సులో అలజడి పెరుగుతుంది అసలే కోతి, అది కల్లు త్రాగింది. కాలిలో ముల్లు గుచ్చుకుంది. ఇదీ చాలదనట్లు దానికి దయ్యం పట్టింది. ఇక దాని మనఃస్థితి ఎలా ఉంటుందో వేరే చెప్పాలా? విషయాలలో మునిగిన మనస్సు అలా ఉంటుంది. పొద్దు పోయి రాత్రి వస్తుంది. అది నిద్రపోయేదెప్పుడు? మనిషికి తగినంత నిద్ర ఉండాలి. బలవంతంగా లేచి పనులు చేయకూడదు. కోడికి ఉండే జ్ఞానం మానవుడికి లేదు. సృష్టిలో జీవరాసులు వాటిపని అవి చేసుకుపోతున్నాయి. మనం నిద్ర పోవటానికి సమయం కావాలి. రాత్రి నిద్ర పోతే ప్రొద్దుటే చక్కగా లేవవచ్చు. మనం జీవితధ్యేయం తెలుసుకొనేలోపల జీవితం తెల్లారిపోతుందని భయంగా ఉంది. ఇదే టైమ్‌కి ట్రైన్ ఉంటే మనం మేలుకోమా? బాహ్యావిషయాలకోసం ఎన్నింటినో సరిపెట్టుకుంటున్నాం.

ఈ ప్రశాంత సమయంలో ఓంకారం చేసికొంటే మనస్సు ఎక్కడ ఉంది? భగవంతునితో. నీలోనేఉన్న తానును తెలియచేసేవాడు ఎవరు? "నీ హృదయబాబు'' అనేవారు గురుదేవులు. వారు మన హృదయంలో నిలిచిపోయారు. మనం ఈనాటికీ గుర్తించకపోతే అది మన సాధనలో లోపమే. ధ్యానానికి కావలసింది పవిత్రత. మనం ఎటువంటి వెలుగులో ఉన్నాం? సూర్యుని వెలుగుకు వచ్చిపోయే అలవాటు ఉంది. ఆ సూర్యునికి

వెలుగునిచ్చేవాడే మన హృదయబాబు. ఈ పాంచభౌతికదేహం ప్రకాశించాలంటే తన అంశనే మనలో ఉంచాడు. దానిని గుర్తించే అర్హత మనకేఇచ్చారు మన గురుదేవులు.

మాయ మనస్సు అంటావు. అలా అనుకుంటే తరించటం ఎలా? గురుదేవులు నీకు లక్ష్యార్థాన్ని ఇచ్చారు. దాని ద్వారా ఎగబ్రాకి ప్రపంచాతీతమైన అనుభవాన్ని పొందాలి. దానికి ఏవి అడ్డం వస్తున్నాయి? ప్రపంచ విషయాదులు. వాటివైపు పరుగులు పెడుతున్నాం. ఇంకా ఏదో సంపాదించాలి, ఇంకా ఏదో చెయ్యాలి అనే తపన. మన జీవితం ఎంతవరకు? ఒకాయన ఏడుస్తూ వచ్చి నాతో చెప్పుకున్నాడు, "బిజినెస్ చూడడటంలేదని ఇప్పటికీ ఇంకా నా పిల్లలు నన్ను నిందిస్తున్నారు"అని. నేను "గురుదేవులను ప్రార్థించు" అన్నాను. సాధన ఇంకెప్పుడు చేస్తాం? ఇప్పటికైనా మేల్కొని దీర్ఘనిద్రలోకి పోకమునుపే లక్ష్యార్థాన్ని సాధించాలి.

అలా అని మనని మనం ఇలా హెచ్చరిక చేసుకోవాలి. ఆంజనేయ స్వామికి అప్పాలు చేయాలంటే రాత్రి ఒంటిగంటకైనా లేస్తాం. మరి సాధనలో అలా చేస్తున్నామా? ఎందుకు? ఇది మనది అని గుర్తించకపోవటంవల్ల.

బ్రాహ్మీముహూర్తం ధ్యానానికి అనువైన సమయం అనేవారు గురుదేవులు. అందుకని ధ్యానానికి ముందర లోపల ప్రయత్నం చేయాలి.మన నాధుడు ఒక్కడే. ఆయనే గురుపరమాత్మ. వారు రాత్రనక పగలనక మనకోసం ఎంత త్యాగంచేశారు? నాపిల్లలు బాగుండాలని వారు ఎంత తపించారు? మనం ఆ గురుపాదం స్థిరంగా పట్టి స్థితప్రజ్ఞులం కావాలి.

గురుపాదం మనకు అందించారు. కులశైలములు పెళ్ళగిలి పైబడినా, జలరాసులు పొంగి ప్రళయం వచ్చినా చలించకూడదు. మనస్సును అంతర్ముఖం చేయండి. బాబు మీలోనే ఉన్నారు. సాధనను క్రమంగా తీవ్రంచేయాలి. ఒక్కసారిగా చేస్తే స్ప్రింగ్‌ని ఒక్కసారిగా వదిలితే ఏవిధంగా ముఖం బ్రద్దలవుతుందో అలా అవుతుంది. నూతిలోని నీరు తోడుకోవాలంటే త్రాడుముడి బయటుంటేనే తోడుకోగలం.

మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారాలను సత్యం, శాంతి, దయ, ప్రేమలుగా మార్చుకో. గురుదేవులు ప్రసాదించిన లక్ష్యార్థాన్ని సాధించు. అప్పుడు అన్ని క్షేత్రాలలోని దేవుళ్ళను నీలోనే దర్శిస్తావు. నువ్వు కాశీ, తిరుపతి క్షేత్రాలకు వెళితే ఎంత సేపు దర్శనం చేయనిస్తారు? 'పోంగో', 'పోంగో' అని

పంపేస్తారు. నువ్వు నీ మనస్సును అంతర్ముఖం చేసుకుని ప్రణవోపాసన చేయాలి. అంటే ప్రణవంతోపాటు శ్వాసను లోపలికి తీసికొని విడిచేటప్పుడు ఓంకార జపం చేయాలి. ఈ శ్వాస తీసికోవటాన్ని విడవటాన్ని పూరకము, కుంభకము, రేచకము అంటారు. శ్వాస తీసికొని కుంభిస్తే ఓంకారాన్ని లోపల అనుభవించ గలుగుతావు. పూరకంలో గాలిని పీల్చినప్పుడు అంతరంగంలో బాబును గమనించండి. కుంభకం, రేచకం చేసేటప్పుడు మరల నామంతో గురుదేవులను గమనించండి. ఇంక 'గేప్' ఎక్కడ వస్తుంది? ఇలా మనస్సును శ్వాసపై నిలిపి శ్వాస లోపలికి తీసికొన్నప్పుడు ఆస్వాదన చేస్తూ, తిరిగి పూరిస్తూ, విడుస్తూ సర్వకాలసర్వావస్థలయందు నామం చేయాలి. అయితే విశ్వాసం ముఖ్యంగా ఉండాలి.

మనస్సును అంతర్ముఖంచేసి బాబును అర్చించుకొందాం. బయటచేసే ఆరాధనకు మనుషులు కావాలి. కాని అంతర్ముఖం అయి చేసే ఈ సాధనకు ఎవరు కావాలి?

లోపలకి శ్వాస తీసికొని హృదయబాబును అర్చించుకోవాలి. శ్వాసను నామంతో బయటకు వదలాలి. ఎప్పుడూ ఆ స్థితిలో ఉండగలగాలి. అటువంటి భక్తిని, శక్తివి, సాధనాసంపత్తిని గురుదేవులు ప్రసాదించెదరుగాక! సుఖీభవ ! సుఖీభవ!!

# శ్రద్ధాంజలి

ఆశ్రమంలో స్థిరనివాసులైన, పరమ భక్తులైన పాలూరి వెంకట శివ సుబ్బారావుగారు (భీమవరం తాతయ్యగారి పెద్ద కుమారుడు) 31-12-08 బుధవారం ఉదయం 11గం.30ని॥లకు శ్రీసద్గురు సాయుజ్యం పొందారు. వీరు గతంలో కొద్ది సంవత్సరాలు ఆశ్రమ ఆసుపత్రిలో తమ సేవలను అందించారు. వీరి వయస్సు 89సం॥లు. వీరికి భార్య, ఒక కుమారుడు కలరు. వీరి కుటుంబసభ్యులకు సద్గురుదేవులు శాంతిని ప్రసాదించెదరు గాక!

# సమర్థ సద్గురు నాధుని దివ్య చరిత్ర

- స్వామి విజయేశ్వరానంద ప్రసాద్

## గురువు ప్రత్యక్ష భగవానుడు

**యః ప్రభుస్సర్వ భూతానాం। యోఽనిర్వాచ్యోఽఖిలాగమైః।**
**యస్యభాసా జగద్భాతి తస్మై సత్యాత్మనే నమః ॥**

సకల జీవ కోటికి ప్రభువైనవాడును, వేదములన్నిటి వలన నిర్వచింప బడనివాడును, తన స్వయం ప్రకాశము చేతనే సృష్టినంతటిని ప్రకాశింప జేయువాడును, సత్య స్వరూపుడును అగు పరమాత్మకు నమస్కారము.

**తూష్ణీం భవన్తి శ్రుత్యన్తాః । నేతి నేతీతి యం వదన్ ।**
**కృపయా స్వస్య యో జ్ఞేయః । తస్మై శ్రీ గురవే నమః ॥**

ఏ పరమాత్మ యొక్క నిజ తత్త్వాన్ని ఉపనిషత్తులు యిదమిత్థమని వివరించ లేక, యిది కాదు, యిది కాదు (న యితి, న యితి) అని మాత్రం చెప్పి ఊరుకున్నాయో, యే పరతత్త్వము మానవుని ఐదు కర్మేంద్రియాలకు, ఐదు జ్ఞానేంద్రియాలకు, మనో బుద్ధి చిత్త అహంకారములనే నాలుగు అంతరింద్రియాలకు కూడ అందరానిదో, ఏ పరతత్త్వము దేశ కాల క్రియాతీతము, నామ రూప గుణ దోష రహితము అయినట్టిదో, దానిని తెలియ జెప్పటానికి ఆ పరమాత్ముడే సమర్థుడు. ఆయన అనుగ్రహము వలన మాత్రమే మానవుడు ఆ పరతత్త్వమును తెలుసుకోగలడు. అలా తెలియజెప్పటానికే పరమానుగ్రహ స్వరూపుడైన పరమాత్ముడు మానవాకృతిని ధరించి గురువు రూపంలో వస్తాడు.



**ధరణి లోపల నారారు తత్త్వములకు**
**నవ్వలైయున్న పరతత్త్వ మెవ్వడెరుగు**
**శివుడు గురు రూపుడై వచ్చి చెప్పకున్న**
**నవ్య తర భోగి శ్రీ చిదానంద యోగి ॥**

ఇక్కడ శివుడంటే సర్వ మంగళ ప్రదుడైన పరమాత్ముడని అర్థమే కాని త్రిమూర్తులలో లయకారకుడైన శివుడని గ్రహింప రాదు. సృష్టి స్థితి లయ కారకులైన బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు అధిష్ఠానమైనది పరబ్రహ్మ తత్త్వము. అదే పరతత్త్వము. అదే గురుతత్త్వము. కనుక గురువు అంటే సాక్షాత్తు పరమాత్ముడే.

**గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః । గురుర్దేవో మహేశ్వరః ।**
**గురుస్సాక్షాత్ పరబ్రహ్మ । తస్మై శ్రీ గురవే నమః ॥**

ఈ సృష్టి స్థితి లయ కార్యములకు మూలమైన, అనంత శక్తి స్వరూపమైన పరబ్రహ్మమే గురుదేవుడు. గురుతత్త్వాన్ని తెలియజెప్పటానికి యీ ఒక్క శ్లోకమే చాలు.

మరి యీ పరమాత్ముడు ఎక్కడ ఉంటాడు? ఆయన నిజ స్థానమేది? తన నిజ తత్త్వమును గురించి మానవునికి యెరుక పరచటానికి ఆ పరమాత్ముడు ఎక్కడ నుండి వస్తాడు? ఎలా వస్తాడు? ఎప్పుడు వస్తాడు?

**హృదయమె శివ మందిరమని మొదలు తెలియవే మనసా ।**
**మాయ యను కవాటము ఆ మందిరమును మూసినదే ।**
**శివుడే సద్గురు రూపము స్వీకరించి వచ్చునే ।**
**తన కృపా ప్రసారమ్మున ద్వారమ్మును తెరచునే ।**
**తన బోధల వెలుగున శివ (నిజ) దర్శనమ్ము చేయించునె ॥**

సర్వభూతాంతరాత్ముడైన ఆ పరమాత్ముడు మానవుని హృదయంలోనే ప్రకాశిస్తున్నాడు. కాని ఆ హృదయ మందిరాన్ని అహంకార మమకారములనే రెండు తలుపులతో కూడిన మాయ అనే కవాటము మూసివేసి, ఆ పరమాత్ముని దర్శనము మానవునికి లభించకుండా చేస్తున్నది.

ఎక్కడిదీ మాయ? దానిని ఎలా దాటాలి?

**దైవీహ్యేషా గుణమయీ । మమ మాయా దురత్యయా ।**
**మామేవ యే ప్రపద్యన్తే । మాయా మేతాం తరన్తితే ॥** (భగవద్గీత)

ఆ మాయ తన మాయే అని, దానిని తమంతట తాముగా దాటటం ఎవరి తరమూ కాదని, తనను (పరమాత్మను) భక్తి ప్రపత్తులతో శరణు పొందినవారు మాత్రమే ఆ మాయను దాటగలరని శ్రీకృష్ణ పరమాత్ముడు స్వయంగా భగవద్గీతలో స్పష్టం చేశాడు. అంతటితో ఊరుకోక, తనను శరణు పొంది **శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నం** - నీ శిష్యుడనై ప్రపన్నుడనైన

నాకు కర్తవ్యమును బోధించు'' మని ప్రార్థించిన అర్జునునితో **"సర్వ ధర్మాన్ పరిత్యజ్య । మామేకం శరణం వ్రజ । అహం త్వా సర్వపాపేభ్యో మోక్ష యిష్యామి మాశుచః ॥** - అన్ని యితర చింతలు మాని నన్నే శరణు పొందు. నేను నిన్ను అన్ని కర్మపాశముల నుండి విముక్తుణ్ణి చేస్తాను. దిగులు పడకు'' అని సూటిగా, సంశయానికి తావు లేకుండా కర్తవ్యాన్ని బోధిస్తూ అభయమిచ్చాడు. అది పరబ్రహ్మ స్వరూపుడైన దేవకీ తనయుడు సద్గురువు స్థానంలో, అర్జునుని నెపంతో మనకందరికి అందించిన అభయ వాక్యము. **(బ్రహ్మణ్యో దేవకీ పుత్రో బ్రహ్మణ్యో మధుసూదనః । కారణ పురుష మకారణం పరబ్రహ్మోం** - నారాయణోపనిషత్తు) అలా తనను శరణు పొందిన శిష్యునికి అభయమివ్వగల ధీరత్వము, యిచ్చినదానిని నెరవేర్చ గల సామర్థ్యము, పరబ్రహ్మ స్వరూపుడైన సత్యగురువుకు మాత్రమే ఉంటుంది.

## గురువు అవసరం ఏమిటి ?

మానవ శరీరం తొమ్మిది చిల్లులతో కూడిన తోలుతిత్తి.

**తోలు తిత్తి యిది । తూటులు తొమ్మిది । తుస్సు మనుట ఖాయం**
**ఓ జీవా! తెలుసుకో అపాయం । సద్గురు శరణమే ఉపాయం ॥**

మన దేశం లోని పట్టణాలలోనూ, పల్లెలలోనూ, వాడ వాడలా సంచరిస్తూ కనిపించే యే సాధువు నోటి వెంట అయినా అలుపు లేకుండా వినిపించే పిలుపు యిదే. ఈ చిల్లుల తిత్తిని నమ్ముకొని సంసారమనే సముద్రాన్ని దాటటానికి ప్రయత్నం చేసే మానవునికి ఎదురయ్యే కష్టనష్టాలూ, భ్రమ ప్రమాదాలూ అన్నీ యిన్నీ కావు. మానవ మాత్రులెవరూ యీ కష్టాల కడలి నుండి తమను గట్టెక్కించ లేరని, ఆలకించే వాడు, ఆదుకొనే వాడు, ఆర్చే వాడు, తీర్చే వాడు ఆ భగవానుడొక్కడే అని అందరికీతెలిసిన విషయమే. కాని బాధా తప్తమైన హృదయం ఓదార్పును కోరుతుంది. ఏదో ఒక ఆలంబనం కోసం అలమటిస్తుంది. భగవంతుడు దయామయుడే ; కాని కనబడడు. "ఏదో ఒక రూపంలో ఆ భగవంతుడు వచ్చి కంటికి కనిపించి, కన్నీరు తుడిచి, వెన్ను తట్టి అభయమిస్తే ఎంత బావుండును? '' అని మనస్సు ఆరాట పడుతుంది.

-సశేషం

# వార్తా కదంబం

## శ్రీమాతాజీవారి సత్సంగ కార్యక్రమాల వివరములు

**ఫిబ్రవరి**

1 **విజయవాడ,** యస్.వి.యస్ కళ్యాణ మంటపంలో, శ్రీసద్గురు లలితా త్రికోటి పూర్ణాహుతి మహాయజ్ఞం. శ్రీమాతాజీవారిచే కుంకుమపూజ, సత్సంగ సమావేశము, హోమం, అన్నదాన వితరణ.

**2 - 4 వరకు కేశవరం గ్రామం** (గణపవరం మండలం), ప॥గో॥జిల్లా శ్రీఉమాకొండ మల్లేశ్వరస్వామివారి దేవస్థానంలో శ్రీసౌరయాగం సందర్భంగా శ్రీమాతాజీవారి ప్రవచనం. వివరములకు - సెల్ 9491723859

**5 పెద నింద్రకొలను** శాఖలో భీష్మఏకాదశి, శ్రీసద్గురుమూర్తి ప్రతిష్ఠా అయిదవ వార్షిక మహోత్సవము. శ్రీసద్గురుపాదపూజ, సత్సంగ సమావేశము.

**6 - 7 గండిక్షేత్రం**లో కడపజిల్లా శ్రీభూమానందాశ్రమంలో శ్రీసద్గురు జ్ఞాన సదస్సు, సాధుసమ్మేళనము, శ్రీమాతాజీవారి ప్రవచనం. వివరములకు - ఫోన్ 08588 - 283301

**17 - 19 భీమవరం**, ప॥గో॥జిల్లాలో శ్రీమాతాజీవారి సత్సంగ సమావేశం.
వివరములకు - సెల్ 9866113614 మరియు 9246668074

**19 గణపవరం** ప॥గో॥జిల్లాలో, శ్రీసాయిబాబా ఆలయంలో శ్రీమాతాజీవారి ప్రవచనం.
వివరములకు - సెల్ 9490107589

26 **గాగిళ్ళపురం**, కరీం నగర్ జిల్లా, అఖిలాంధ్ర సాధుపరిషత్ 44వ సభలో శ్రీమాతాజీవారి అభిభాషణ. వివరములకు - సెల్ 9440339448

**మార్చి 2009**

**3 - 5 వాక్కాడి గ్రామం**, జలగాం జిల్లా, మహారాష్ట్రలో శ్రీగురుప్రభ పవర్ లిమిటెడ్‌వారి ఆవరణలో శ్రీసద్గురుగణపతి హనుమత్ చండీ యాగం, సత్సంగ సమావేశము, 5వతేదీన శ్రీశ్రీశ్రీ హనుమత్కాళీ వరప్రసాద్‌బాబూజీ మహరాజ్ వారి దివ్యమూర్తి ప్రతిష్ఠా మహోత్సవము.
వివరములకు - ఫోన్ 0257-2355501, 2355502, 2355503

**11 షోలాపూర్**లో 83వ శ్రీసనాతన వేదాంత జ్ఞానసభలో శ్రీమాతాజీవారి ప్రసంగం.

12 తెనాలిలో శ్రీఅష్టలక్ష్మి అమ్మవారి జయంతి సందర్భంగా పరమపూజ్య శ్రీ దండి నిర్మలానంద స్వామివారి ఆధ్వర్యములో జరుగుతున్న శ్రీ అమ్మవారి ఊంజలసేవలో శ్రీమాతాజీవారి అభిభాషణ.

**18 - 20 ఈదుల బళ్ళాపురం గ్రామం**, అనంతపురం జిల్లా, శ్రీరామకృష్ణ ఆశ్రమంలో జరుగు వార్షిక సత్సంగ సమావేశములలో శ్రీమాతాజీవారి ప్రవచనం. వివరములకు - సెల్ 9440521841 మరియు 9440521849.

**27 సంవత్సరాది** మౌనధ్యాన సప్తాహ శిబిరం **నంబూరు, కాశీవనాశ్రమం**లో ప్రారంభం.




(గతసంచిక తరువాయి) -రమణ ప్రసాద్

మూడువేల సంవత్సరాలు!...అందులో ఇంకా ఎన్ని సంవత్సరాలు మిగిలి ఉన్నాయి?... ఉద్ధవుని ముఖంలో కరుణతాలూకు ఛాయలు గోచరించాయి. అశ్వత్థామ దేశ, కాల, క్రియా సీమలకు ఎప్పుడో ఆవలగా వెళ్ళిపోయాడు. ఇప్పుడు వాటి ప్రభావం అతనిపై ఏమాత్రమూ ఉండదు. బహుశ ఆ దారుణ సంఘటన తర్వాత ఒక పరిచితుడు తారసపడటం, అతనితో మాట్లాడటం ఇదే మొదటిసారి అయిఉంటుంది. మహాకాలుడు అతనితో ఏకాకృతి పొందాడు!

"వత్సా!" ఉద్ధవుడు కరుణ ఉట్టిపడుతుంటే ఆర్ద్రమైన స్వరంతో అన్నాడు, "మహాకాలుని అనంత సుదీర్ఘకాలంలోమూడు వేల సంవత్సరాలు ఒక్కక్షణం వంటిది అంటే అది ఏపాటిది? ఆ క్షణంకూడా ఎక్కువదూరం ఉన్నట్లు లేదు. బహుశ ఇప్పుడే వచ్చినా రావచ్చు!" అలా అంటూ ఉద్ధవుడు అశ్వత్థామ ఈ 36 సంవత్సరాలు ఎలా గడిపాడో? అతడు ఏమేమి బాధలు అనుభవించాడో? ఆ బాధలను ఎలా సహించాడో? మనస్సులో ఊహించు కుంటున్నాడు.

"ఉద్ధవా! అనంత యుగాలనుండి నిరర్థకంగా తిరుగుతున్నాను.... సమయం అనే కాలసర్పం తన వేల పడగలతో విషం గ్రక్కుతూ నన్ను చుట్టుకుని కాట్లువేస్తున్నట్లు ఉన్నది. అయినా ఇప్పుడు నాకు ఒక అభిలాష కలుగుతోంది." అన్నాడు అశ్వత్థామ.

"ఇంకా ఇప్పుడుకూడాతీవ్రమైన అభిలాషా?... ఇంత జరిగినా ఇంకా ఏవేవో వాసనలు నిన్ను పట్టి పీడిస్తూనే ఉన్నాయా? ఇప్పుడు నీవు అనుభవించే బాధలు ఏమైనా తక్కువా? అవి చాలవన్నట్లు ఇంకా ఎందుకు వాసన అనే అగ్నిని నీవు స్వయంగా ప్రజ్వరిల్లేలా చేస్తున్నావు"... ఉద్ధవుడు వ్యధాపూరిత స్వరంతో అన్నాడు.

"ఉద్ధవా! నేను ఇంతవరకు ఏది చేశానో, ఈ రోజు వరకు నాలో ఏ కోరికలు కలిగాయో వాటన్నిటి నిరర్థకతను గుర్తించిన తరువాత నాలో ఇప్పుడు

ఒకే ఒక కోరిక మిగిలిఉన్నది...'' కొంచెం ఆగి అశ్వత్థామ తిరిగి ఇలా అన్నాడు,“ఆ యుద్ధంలో 18వరోజు అర్ధరాత్రి నేను చేసిన కృత్యం నీచాతినీచము, అత్యంత అధమము, ఘోరము అయినది... ఎంత ఘోరంఅంటే ఈ ప్రాయశ్చిత్తమనే పశ్చాత్తాపాగ్నిలో ఇలా దగ్ధంఅయ్యే అవస్థ కృష్ణుడు నాకు ప్రసాదించిఉండకపోతే నాకు త్రిలోకాలలో ఎక్కడా స్థానం లభించేది కాదు! అర్జునుని చేతిలోగాని, భీముని చేతిలోగాని ఆ రాత్రి నేను మరణించిఉంటే నా అశరీర మనస్సుకు ఎక్కడా స్థానం ఉండేదికాదు. ఈ దేహంతో నేను చేసిన అపరాధాలకు నా ఆత్మఅవిరామంగా అనంతమైన వేదన అనుభవించవలసి ఉండేది! కృష్ణుడు నన్ను ఉద్ధరించి, నా మనస్సుకు ముక్తి కలిగించటంకోసమే నా ఈ పార్థివ శరీరం చేసిన అపరాధాలకు ఈ దండన విధించాడు! కృష్ణుడు చూపిన ఈకృపకు నిజంగా నేను అర్హుణ్ణి కానేమో అనిపిస్తోంది ఉద్ధవా!'' అశ్వత్థామ పశ్చాత్తాపంతో కుమిలిపోతున్న తన మనస్సులోని ఉద్వేగాన్ని శాంతింపచేయలేకపోతున్నాడు.

“ శాంతించు నాయనా శాంతించు!'' అశ్వత్థామ బుజాలపై చేయి వేసి ఉద్ధవుడు అశ్వత్థామను అనునయించటానికి ప్రయత్నించాడు'' ఆ గతించినదాని స్మృతులను విస్మరించటానికి ప్రయత్నించు... అసలేమీ జరగనట్టుగా భావించు...''

“ఒకే మార్గంఉంది... దానిని విస్మరించటానికి ఉద్ధవా! అదైనా మీరు నాకు సహాయం చేస్తే'' అన్నాడు అశ్వత్థామ.

“వత్సా! అయితే ఇంకా సంశయంఎందుకు? నేను ఏమి చేయాలో చెప్పు?

“తండ్రీ...చెప్పనా?... నేను చెప్పాల్సిందే అది...నేను ఒక్కసారి, ఒక్కసారంటే ఒక్కసారి కృష్ణుణ్ణి దర్శించాలి...''

“కృష్ణుని దర్శనమా!''... ఉద్ధవుడు స్తబ్ధుడయినాడు. ఆయన ముఖం వెలవెలపోయింది... అశ్వత్థామ ఇలా అంటున్నాడేమిటి?... ఉద్ధవుడు తన ఆలోచనలనుండి తేరుకోకముందే అశ్వత్థామ తిరిగి అన్నాడు.

“అవును... కృష్ణుని చరణాలపై పడి ... నేను చెప్పుకోవాలి... ఆయన పాదాలపై వ్రాలి నా హృదయకుహరంలో దాగిఉన్న పాపాలను ఆయన సమక్షంలో చెప్పుకుని నా హృదయాన్ని ప్రక్షాళన చేసికొవాలి తండ్రీ!...''

ఉద్ధవుడు కళ్ళు మూసుకున్నాడు... తానిప్పుడు అశ్వత్థామకు ఏమని

చెప్పాలి? కృష్ణుని దర్శనమా?... ఇప్పుడు ఆ సౌభాగ్యం ఎలా లభిస్తుంది? ఇప్పుడు కృష్ణుణ్ణి కేవలం జ్ఞాన నేత్రాలతో చూడటం మాత్రమే సాధ్యం - ఈ చర్మచక్షువులకు అందనంత దూరంగా వెళ్ళిపోయాడా మహాత్ముడు!... ఇది అశ్వత్థామకు ఎలా తెలుస్తుంది? ఒకవేళ తెలుసుకుంటే అతడు ఆ సత్యాన్ని భరించగలడా?..."ఆచార్యపుత్రా!" ఉద్ధవుడు సావధానంగా అన్నాడు, " ఏ పాపం నీ అంతరాంతరాలను దహించివేస్తున్నదో, ఆ పాపం నీలో కలిగించే వేదనలో నీ మనస్సు ప్రక్షాళనమై నిర్మలమవుతుంది!... అక ఆ భారాన్ని మోస్తున్నానన్న భావాన్ని విడిచిపెట్టు నాయనా!"

"ఈ పాపభారాన్ని మోయటం నా వలన కావటంలేదు తండ్రీ!... నాకు ఊపిరి సలపడంలేదు!... శ్రీకృష్ణుని పాదాలకు నా శిరస్సును ఆనించి స్వయంగా నా ఘోరకర్మలను అంగీకరించినప్పుడే నాకు పాపవిముక్తి లభిస్తుంది. నా మనస్సు శాంతిస్తుంది"

ఉద్ధవుడు దీర్ఘంగా నిట్టూర్చి అన్నాడు. " వత్సా! పరవాలేదు. ఇప్పటికైనా మించిపోయింది లేదు. నీవు హృదయపూర్వకంగా ఆ పనిని నా సముఖంలో చేస్తే నీవు తప్పక ఆ పాపం నుండి విముక్తుడవు కాగలుగుతావు." అశ్వత్థామ దయనీయ మైనస్థితి ఉద్ధవుడు భరించలేకపోతున్నాడు.

అశ్వత్థామ కొన్ని క్షణాలు అలానే చూస్తూ ఉండిపోయాడు... లోపల అతనిని ఏదో ఒక సంకోచం ఇంకా పీడిస్తోంది.. అతడు ఉద్ధవునివైపు చూశాడు. అతని పెదవులు కొద్దిగా వణికాయి... అతడు ఉద్వేగాన్ని అణుచుకో లేకపోతున్నాడు. వేయి అగ్ని పర్వతాలు బ్రద్దలైనప్పుడు ఆపటానికి వీలు లేకుండా బయటకు ఎగజిమ్మే లావాలా లోపలనుండి బయటకు రావటానికి ప్రయత్నిస్తున్న మాటలను ఆపలేకపోతున్నాడు. అతడు చివరకు అన్నాడు "ఉద్ధవా! నీవు నమ్మగలవా? ఒకసారి నేను కృష్ణుణ్ణి హత్య చేయటానికి పన్నాగం పన్నాను!"

"కృష్ణుని హత్య చేయటమా?" ఉద్ధవుడు ప్రశాంతంగా అన్నాడు. "అది మహాయుద్ధం వత్సా! యుద్ధంలో శత్రుపక్షంలోని ప్రతి వీరుడినీ చంపటం అనేది ఇరు పక్షాలవారూ చేస్తారు. ఇందులో ఏమీ పాపం లేదు." అన్నాడు ఉద్ధవుడు.

-సశేషం

Printed, Published by C.V. Ramana Babu, on behalf of YOGINI SRI CHANDRA KALI PRASADA MATHAJI CHARITABLE TRUST and Printed at Samardha Sadguru Publications, D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh, and published at D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh. Editor - Guda Siva Rama Murthy,